శేషాద్రి రమణ కవులు

చంద్రహాస చరిత్ర

గుంటూరు, 1928

Record no. 198

**SUNDARAYYA VIGNANA KENDRAM**
1-8-1/B/25/A, Bagh Lingampalli
Hyderabad – 500 044, Andhra Pradesh, India

Bibliographic Record Target

శేషాద్రి రమణ కవులు.

చంద్రహాస చరిత్ర / శేషాద్రి రమణ కవులు.- గుంటూరు : మాదిరాజు రఘునాధరావు, 1928.

(2), 3, (1), 106, (1) p. :port. ;16 cm.

Record no. 198

Śēṣādri Ramaṇa Kavulu.

Candrahāsa caritra / Śēṣādri Ramaṇa Kavulu.- Guṇṭūru : Mādirāju Raghunādharāvu, 1928.

(2), 3, (1), 106, (1) p. :port. ;16 cm.

Record no. 198

35 mm microfilm

Image placement: IA IIA IB IIB    Date filming began:



మాదిరాజు రఘునాథరావు.

శ్రీ

# చంద్రహాస చరిత్ర.

BY

శ్రీ శేషాద్రి రమణ కవులు

( శతావధానులు. )



PUBLISHED BY

మాదిరాజు రఘునాథరావు

1928.

వెల రు 0—6—0.

# OPNIONS

# అభిప్రాయములు.

శ్రీరామ.

"చంద్రహాస చరిత్ర" అను నాల్గాశ్వాసముల గ్రంథము నామూలాగ్రము చూచితిని. కథ నీతిబోధక మగుటయే కాక హృదయరంజకమునై యున్నది. కవితయుఁ బ్రకృత కాలానుగుణమయి మృదుమధుర శైలిలో నున్నది. ఇందు వచనములు పదు, ఎనిమిది, కన్న నెక్కువ లేవు. తక్కినవన్నియుఁ బద్యములే కావున ధారణకుఁ గూడ ననువగును. ఇట్టి గ్రంథములు పాఠశాలల యందుపయోగింపఁ బడినచోఁ బిల్లలకు బహూపయోగకరములని నాయాశయము.

గుంటూరు,
[illegible].

కాశీ కృష్ణాచార్యులు,
శతావధాని.

శ్రీగురవేనమః.

తే॥ గీ॥ చంద్రహాసుని కథయెంత సరసమగునొ
దానికిందగ్గ కవనమ్ము దనరునిందు
ప్రకృతకాలవిద్యార్థుల పాఠమునకు
ననువయిన పుస్తకమ్మన నభిమతమ్ము॥

గుంటూరు,
10—10—1927

శిష్ట్లా హనుమచ్ఛాస్త్రి
ప్రధానాంధ్రోపాధ్యాయుడు,
బోర్డు హైస్కూలు

# పీఠిక.

శ్రీభరతావనిగల ఛప్పన్నాగుదేశములలో నాంధ్రరాష్ట్ర మొకప్పుడు దిగంతప్రఖ్యాతి నందియుండెను. దీనికి త్రిలింగదేశమని యుపనామముగలదు. త్రిలింగతద్భవము తెలుగు. ఇయ్యది ఆంధ్రభోజుడని నుతిగన్న కృష్ణదేవరాయలకాలమున వికాసము జెందుటకారంభించెను. మనుచరిత్ర విష్ణుచిత్తీయము వసుచరిత్ర మొదలగు ప్రబంధములెన్నియో బయలువెడలెను. తదుపరిరాజులు ధనదాతలు మండలేశ్వరులు మొదలగువారు తమపేరులు స్థిరస్థాయిగానుండుటకు కృతులే హేతువులని దలంచి కవులసత్కరించి పద్యగద్యాదిగ్రంధముల నంకితముగొనియుండిరి. వర్తమానకాలమం దనేక నవలలు చరిత్రలు తత్వార్థికాదిశాస్త్రములు పరిపాలనావిధానసూత్రములు వస్తునిర్మాణ రసాయనాదిశాస్త్రములు కవిజీవితములు భాషాంతరీకరణములు మొదలగు నవిబయలువెడలి భాషాపోషణకు దోహదమొసంగియుండెను కానిగద్యపద్యప్రబంధరచన కొంతవరకు మందగమనము వహించినటుల ప్రస్తుత పరిస్థితిదెలుపుచున్నది. ఇట్టితరుణములో చంద్రహాసచరిత్రమను నాలుగాశ్వాసముల కబ్బము వ్రాయబడుట శ్రేయస్కరమే. ఏతత్కృతిభర్తయగు మాదిరాజు రఘునాథరావుగారు వందనీయులు. వీరునియోగిబ్రాహ్మణులు. సద్వంశజులు ఈకృతినాథునితండ్రి అబ్బరాజుగారు. తల్లిజగ్గాయమ్మగారు. ఈమెతండ్రిప్రశస్తవంశీయుడగు తుమ్మూరి కోటిలింగంగారు. తుమ్మూరివారువైద్యశాస్త్రాదిగ్రంధకర్తలు కృతిపతులునై విరాజిల్లినారు. శరభరాజీయము భేషజదర్పణాదిగ్రంధముల రచించిన దీతుమ్మూరివంశజులే. కృతినాథుని గూర్చి గ్రంధకర్త వ్రాసినపద్యము యథార్థమును ప్రకటించుచున్నది.

చం॥ సరసుడు వ్యావహారిక ప ♦ శారదు డాంధ్రకవిత్వ తత్వ భా
స్వరు డతిధార్మికుండు ♦ విలసత్తర వైద్యవిశేష వేది సు
స్థిరశివభక్తి తత్పరుడు ధీవరు ♦ డారఘునాధరాయు డి
ద్ధర దనకీర్తి చంద్రికల, దాల్చి ♦ దిశల్ ప్రభలీనుచుండగన్.

దీనియందతిశయోక్తి లేదనుట సందేహము లేదు. కృతిపతి పితర లుభయగోత్రములవారును ధర్మకార్య ప్రతిష్ఠాపకులగుటయేగాక విద్యాప్రవీణులైయుండుటచే ఇట్టివంశములకు జెందిన రఘునాధరాయాహ్వాయు డన్నిటిచే కీర్తినందుట దుర్లభమైనదిగాదు. వైద్యశాస్త్రమేల బట్టువడకయుండును. విద్య కొన్నివంశములందు పారంపర్యముగా వచ్చుచుండును. ఉభయవంశములట్టివియైనపుడిక చెప్పవలసినదని లేదు.

కృతిపతి జననితమ్ముడును వైద్యశాస్త్ర విశారదుడును ప్రశస్తకవియునైన వీచ్చయ్యగారు నాకు మిగులగౌరవనీయులు. కృతికర్తకు కృతినాధుడు ప్రశస్తపురుషుడులభించుటయు నదృష్టమేగదా? మణివలన కంకణమును కంకణమువలన మణియు ప్రకాశించునటుల కృతిపతికృతికర్తలుగలిగిన మిగులకీర్తినిగాంచి ప్రకాశించుచున్నారు. ఈగ్రంధకర్త తనను గూర్చి ఈపద్యములో దెలియపరచియున్నాడు.

మ॥ వను శ్రీరాఘవపాదపద్మ భజనా ♦ నందైకచిత్తాంబుజా
తుని శేషార్యసమాహ్వాయున్నవరస ♦ స్తోమాభిరామాచ్యవా
ఖ్యనిన్ బిల్చి లవంగచంద్రవరపూ ♦ గంబైనతాంబూలమున్
ఘనవస్త్రాదులొసంగి పల్కెమృదువా ♦ క్యస్ఫూర్తి వాటిల్లగన్

కవిశాను ధూపాటిశేషాచార్యుని పౌత్రుడైనటులను వేంకటరంగాచార్యుని పుత్రుడైనటులను నుడివియున్నాడు. పేరు శేషాద్రికవి.



వీరు నాకు పరిచయులగుటచే దెలసినవరకు వివరించుచున్నాడను. వీరు శేషాద్రి రమణసోదర కవులలోనొకరు. శతావధానులు. శాసనముల పరిశోధించి విమర్శించుటలో శక్తిసామర్థ్యముగలవారు. మరికొన్ని నాటకాదిపుస్తకములు వ్రాసినవారు. పాఠకమహాశయులకు దెలసియున్నవారే. కవిత్వముకాలోచితవర్ణాలంకృతమై మృదుమధుర పదలలితమై ద్రాక్షపాకముగా నలరారుచున్నది. అలంకార వర్ణనాదులు పూర్వకవుల సాంప్రదాయకమున కేంతయు దీసిపోనేరవు. పద్యములం దాంధ్రశబ్దప్రయోగములే విశేషముగా కన్పించుచున్నవి. లోకోక్తులందందు బొందుపరుపబడియున్నవి. కధ దుష్టాత్ములకు గల్గిన కీడు దెలుపుచుండుటచే నీతిప్రబోధకమైన దనుటకు సంశయించ బనిలేదు. ఈపొత్తమును ఆంధ్రాంగ్ల పాఠశాలలయందు పఠనీయగ్రంధముగా నేర్పాటుజేసిన బాలురకు భాషాపరిచయముగలుగుటయేగాక సుష్టతనముతొలగించి నీతిని గఱుపగలదు.

శైలిజూపుటకు కొన్ని పద్యములు చూపబడుచున్నవి.

| | |
|---|---|
| ఉ॥ వాసనలేనిపుష్పమును. | పుట 31 |
| గీ॥ పాలుద్రావెడి. | 37 |
| మ॥ అరచేనంచియు. | 53 |

ఇట్లు,

గుంటూరు,
18_5_28.

వెంకటసుబ్బరాయ గుప్త గ్రంధి.
ధన్వంతరి, వైద్యలహరి, స్త్రీ బాల వైద్యసుధాబ్ధి,
సంపూర్ణ భాగవతి నాటకాది గ్రంధకర్త.

# నామగోపన రథబంధయుతసీసం.

శ్రీరమణీమనోహర కౌస్తుభధరా సుగుణ
హారవిరాజిత విగళితాంహ!
వనజాక్ష శ్రీకర ఘననీలసమవర్ణ భామాజనా
జ్ఞాత్ర వనధిశయన
సనకాదిమునిలోక జనవశీకరచిత్త గజవరావన
దక్ష గరుడవాహ!
భక్తరక్షక మంజుభాషణ హరనుత శేషశైల
విహార చిరయశోబ్ధి!
విజయసఖ రఘురామ శోభితకువలయ
నాథ మురహర నగధర నారసింహ
రాజముఖ యదుజయ ధనరాజితైక
వస్తుజాల వెన్నసంగుము వైరిహారి

గ్రంథకర్త,

30-1-1918.

శ్రీరస్తువిజయోస్తు.

శ్రీహయగ్రీవాయనమః.



# చంద్రహాస చరిత్ర.

శ్రీలీలాకరణంబు మంజులతుళస్సీమంతినీభూషణా
శాలీనాఘవిదారణంబు కవితావ్యాసంగ సంగార్భటీ
కేళిద్యోతక మైన శ్రీహరికృపాకల్పప్రభావ్యాపకం
బాలీనాళియసౌఖ్య మిచ్చి రఘునాథామాత్యు రక్షించుతన్॥

సీ॥ కరమున వీణఁ దాల్చి రసకల్పకమంజులగోష్ఠిగీతికా
పాణితి తాండవింప మృగపంచమనాదముతోడ గానముల్
నెఱపు పయోజగర్భు తరుణీమణి ప్రోచును గాత మత్ప్రభు
శ్వరు రఘునాథమంత్రివరు సంతతధర్మకథాధురంధరున్!

చ॥ తన యనురాగముం దెలుపఁ దన్వికి నర్ధశరీరమిచ్చి త
న్వీని యనురాగదృష్టిఁ గను పెంపున నాయమ దేహమందు సా
మును గొని సానురాగరసముం సమభోగ్యముగా నొనర్చు నా
ఘనుఁడు భవానిశంకరుఁడు కమ్రయశున్ గృతిభర్త నోముతన్

చ॥ వనరుహనాభు ప్రొక్కిలి నివాసతలంబు, జగత్త్రయంబు సృ
ష్టిని బొనరించు చేఁత నిజశేముషి, పల్కువెలంది సేవలన్
గొనుట హితంకరంబయిన కూరిమిసేఁతగ నొప్పునట్టి య
వ్వనజభవుఁ డిచ్చుఁ గాతఁ గృతిభర్తకు దీర్ఘతరాయురున్నతుల్ ॥ ౭

చం॥ వితతవియోగదుఃఖమున విన్నదనంబు వహించి లంకలో
నతులదురంతకష్టముల నందుచునున్న విదేహపుత్రికిన్
బతిశుభవార్తఁ దెల్పిన ప్రభావపయోనిధి యాంజనేయుఁ డు
న్నతశుభదృష్టితోడ రఘునాథసమాహ్వయు నోముఁ గావుతన్॥

మ॥ గురుఁడై యాదికళావిధుల్ గఱపి పెక్కుల్ గావ్యరత్నంబులన్
విరచింపం గల తెల్వి నిచ్చియును పైఁ బెండ్లిండ్లు పేరంటముల్
నెఱయన్ జేసి మహావధానకవితానిర్మాల్యసింహాసన
స్థిరునిన్ జేసిన మత్పితన్ దలఁతు రాశీభూతవిద్యాయుతున్॥ ౯

చం॥ గురుని పదాంబుజాతములకున్ బ్రణమిల్లి యపూర్వసత్కవీ
శ్వరులకు వందనంబులను సల్పి సనాతనమార్గగామినై
నరసమృదూక్తిబంధురలసత్తరమై తగు నాంధ్రకావ్యమున్
విరచనముం బొనర్తు సుకవిప్రభులార! యనుగ్రహింపుఁడీ॥ ౧౦



వ. ఇట్లిష్టదేవతాప్రార్థనంబును గురుస్తుతియుఁ బూర్వకవిస్మర
ణంబును గావించికొండొక కావ్యంబు రచింప నుద్యోగింప నున్న
సమయంబున.

### కృతినిర్మాణప్రస్తావన

సీ॥ తనపూర్వు లుద్ధరించిన యాలయంబును
పునరుద్ధరించిన భూరియశుఁడు
శమదమాదికగుణసమితికి నిధి యని
జనులచే నుతి గను సజ్జనుండు
దానధర్మములు హస్తద్వయంబునకును
నైజముల్ జేసిన న్యాయవిదుఁడు
సత్యప్రియత్వంబు సర్వసమత్వంబు
నాచరించెడి కరుణాకరుండు
అబ్బరాజుకులాంభోధిఁ కబ్జమిత్రుఁ
డార్యనుతసంతతవితీర్ణహారిమూర్తి
సాధుమార్గహితుఁడు రఘునాథరాయ
లెలమితోడ గృహంబునఁ గొలువుఁదీరి॥

మ॥ నను శ్రీరాఘవపాదపద్మభజనానందైకచిత్తాంబుజా
తుని శేషార్యసమాహ్వయున్ నవరసస్తోమాభిరామాచ్ఛవా
క్పనిధిన్ బిల్చి లవంగచంద్రవరపూగంబైన తాంబూలమున్
ఘనవస్త్రాదు లొసంగి పల్కె మృదువాక్యస్ఫూర్తి వాటిల్లఁగన్

కం॥ శ్రీచంద్రహాసు చరితము
వాచాలకవిత్వవైభవం బలరారన్
బ్రాచుర్యముగాఁ గృతి సే
పాచార్యా! సలిపి నాకు నంకిత మిమ్మా॥ ౧౧

కం॥ అనుటయుఁ బరమానందం
బును జెంది రసానుకూలముగఁ గావ్యంబున్
దెనుఁగున లిఖియించితి స
జ్జనులారా! కావ్యరసము చవికొనఁగదరన్॥ ౧౨

వంశావతారము.

కం॥ దృశ్యాదృశ్యాత్మక ధీ
వశ్యపరబ్రహ్మపాదపంకజభజనా
వశ్యాచరణుఁడు శ్రీమ
త్కాశ్యపముని మించు మౌనిగణనుతకీర్తిన్॥ ౧౩

ఉ॥ ఆ యనఘాత్మశాలియె నిజాన్వయగోత్రవరుండు గాఁగఁ దే
జోయుతుఁ డార్యసంస్తుతయశోరమణీయదిగంతరుండు శ్వ
శ్రేయసలోకసంతతవశీకరణప్రవణుండు కావ్యవి
ద్గేయుఁడు మాదిరాజు వెలఁగెన్ వ్యవహారకళాకలాపుఁడై॥ ౧౪

కం॥ ఆ మాదిరాజు లోకా
సామాన్యయశంబుఁ గాంచి సాత్వికమతియై
భూమి వినెఁ; నద్ది మొదలుగ
నామహితాన్వయము నాయకాఖ్య వహించెన్॥ ౧౫



శా॥ వాగ్గంగాశరహారహీరనిభదివ్యత్కీర్తి విభ్రాజమా
జగ్గాయమ్మ స్వగేహినీతిలకమై సౌజన్యమున్ జూప స
మ్యగ్గార్హస్థ్యసుఖానుభావనవసంపచ్ఛాలియై సద్యశ
స్స్రగ్గంధోజ్జ్వలుఁ డబ్బరా జలరెఁ దత్సద్వంశభూషాత్ముఁడై॥ ౧౬

సీ॥ అగ్రజనంబుల కన్నదాన మొనర్చి
వితరణవిఖ్యాతివిభవ మందె
సకలపుణ్యక్షేత్రసందర్శనము సల్పి
గార్హస్థ్యధర్మముల్ గౌరవించె
శ్రితకామినీతిరస్కృతి సల్పి యేకప
త్నీవ్రతధర్మంబు నిర్వహించెఁ
గవులచే నుతిపద్యకాండంబు గ్రహియించి
స్థిరయశస్సాంద్రచంద్రికల నించె
రహిఁ దన పేరుతో "నబ్బరాజుపాలె"
మను పేరి నగరంబు నిర్మించె నతఁడు సచివ
మాత్రుఁడే వందియాచకస్తోత్రధామ
రాజితవికాసఖని యబ్బరాజుమంత్రి॥ ౧౭

కం॥ అల యబ్బరాజుసచివుఁడు
కులసతితో మెలఁగుచుండఁ గొమరుఁడు గలిగెన్
కలితకళాపద్మజుఁడు
జ్వాలరూపుఁడు శరభరాజు జననుతమతియై॥ ౧౮

చం॥ గురుతరసద్యశోధనముఁ గూర్చి నిరంతరసత్యభాషణా
కరుఁడయి పూర్వకావ్యరసగంధమధుద్రవపానకౌతుకా
భరణగుణాభిరామ నిరవద్యతరప్రతిభాప్తి మీఱి ధీ
రరసికు లెన్నఁగా శరభరాజు తనూజులఁ గాంచె నల్వురన్॥ ౧౯

సీ॥ వితతవిరోధిదుష్కృతదుస్తరధ్వాంత
యామినీనిశిరాజు సోమరాజు
అతులశృంగారరసాకరయువమనో
హారిణీరతిరాజు వీరరాజు
ధృతిపరాక్రమరసాదికతిరస్కృతవనీ
రమణీయమృగరాజు రామరాజు
సతతసత్యవ్రతాచరణనిర్మలయశో
రఘురాజు శ్రీశివరామరాజు
జలజసంభవు ముఖచతుష్టయము రీతిఁ
గల్పతరుశాఖికాచతుష్కంబు పగిది
శరభరాజు ప్రమోదవిస్తరము నొంద
మించి కౌదార్యలక్ష్మి వహించ ధాత్రి॥ ౨౦

కం॥ వీరల లోపల గుణవి
స్తారుండై రామరాజు ధార్మికవిద్యా
పారాధిగమనుఁడై శశి
తారానిభశుభ్రకీర్తిధనము గడించెన్॥ ౨౧



చం॥ ప్రవిమలకృష్ణవేణినది పశ్చిమ మందలి "రావిపాడి"లో
భవుని ప్రతిష్ఠ సల్పి యపవర్గము లందియు నబ్బరాజుప
ల్లె వసుధ పావనత్వముఫలింపఁ దటాక మొనర్చి శైలజా
ధవుని ప్రతిష్ఠ సల్పియుఁ బ్రథన్ గనె రామయమంత్రి ధన్యుఁడై॥ ౨౨

కం॥ ఆ రామయ పెండ్లాడె ద
యారాజితహృదయ రామమాంబను సుగుణా
ధార సుతి వేంకమాంబను
చారుతరాత్మీయకీర్తిసన్నిభ మతులన్॥ ౨3

చం॥ ఎఱుగ దసూయ భర్తృహితమే యొనరించుచు నుండు సత్యవా
క్పరిణతి పీడనాడదు కృపామతి వీడదు రామమాంబ సో
దరులను బోలె నన్యులను దన్పును సల్పును నాథుసేవ దు
శ్చరితులఁ గాంచ నోపదు లసన్మతి వేంకమ సర్వవేళలన్॥ ౨౪

సీ॥ ఇరువురు శారదాతరుణితో నాత్రేయి
తోఁ బోలుదురు కళాస్తోకగరిమ
ఇరువురు ధారుణీధరజాతతో ధరా
జాతతోఁ దుల్యులు సత్యకలన
ఇరువురు నింద్రుని యువతితో సత్యావ
రోధుతో సములు స్వరూపనియతి
ఇరువురు చంద్రసోదరితో ధనసూయ
తో సీడు జోడు సంస్తుతగుణాప్తి

ఇరుపురకు నిర్వురే సాటి పరమశాంతి
దాంతిముఖసద్గుణైకసంతానమందు
రామమాంబిక సద్గుణరత్నపేటి
వేంకమాంబిక సత్య మూర్వివధూటి॥ ౨౬

కం॥ ప్రథమసతి కుదయ మందెను
ప్రథమానయశుండు శంకరయ్య వితీర్ణ
గ్రథనైకనిపుణుండై మా
నధనస్తవనీయగుణగణప్రవరుండై॥ ౨౭

కం॥ గాంచె ద్వితీయాంగన ధీ
సంచితనిరవద్యచరితు శమదమశాంత్యా
ద్యంచితమానసపదు ధ
ర్మాంచర యని తలచు నమ్మి రాజవరేణ్యుల్॥ ౨౮

సీ॥ సామ్రాజ్యరక్షణచాణక్యచక్యంబునఁ
జాణక్యమార్గంబు సంతరించి
రాజకీయరహస్యయోజనావిధులలో
నల యుగంధరనీతి నభ్యసించి
పరిపాలనక్రియాపాండిత్యగరిమలోఁ
దిక్కనయాజి పొందికఁ గ్రహించి
స్వాతంత్ర్యచాతుర్యసామరస్యములలోఁ
దిమ్మరుసుమంత్రి మార్గమ్ము గాంచి



భాసురయశోఽభిరాముఁడై వాసికెక్కి
వేంకటాద్రివసుంధరావిభుని చెంత
సచివపదమున మిగులఁ బ్రశస్తిఁ గాంచె
నతఁడు సామాన్యుఁడే శంకరయ్యమంత్రి! ౨౯

కం॥ ఆ శంకరమంత్రికి గుణ
లేశగ్రహణైకసుగుణలీలావిభవుం
డాశాపరీతనుతిపద
పేశలుఁ డగు కోటమంత్రివిభుఁడు జనించెన్॥ ౩౦

చం॥ ఫణిధరు పాదపంకరుహభక్తియుతుం డగు కోటయాఖ్యధీ
మణి పరిపాలనాగతసమగ్రకలావిభవంబు నేర్చి తా
గణకపదంబు నందుఁ బురికర్షకు లుజ్జ్వలసమ్మదోక్తి భూ
షణము లొసంగ మించె సుయశఃకలనావలమానమూర్తియై॥

ఉ॥ హారిభవానిశంకరపదాంబుజముల్ మది నిల్పి భర్తృసే
వారమణీయసద్వ్రతవిభాసురస్వచ్ఛయశఃకలాపయై
మీరెను వేంకమాంబ మొలమిన్ ఘను కోటయమంత్రి భార్యయై
వారధికన్యకాసుగుణవైభవసంగతయై ధరాస్థలిన్॥ ౩౧

కం॥ కొడుకుల నా కోటయసచి
వుఁడు గని యోగులజ యుందుఁ బురుషార్థములో
జడజజు నాస్యచతుష్కము
పుడమిఁ బొడమెననుచు స్వజనములు కీర్తింపన్॥ ౩౨

సీ॥ ప్రథమపుత్రుఁడు కవివర్యసంస్తవనీయ
హరిసద్గుణశాలి యబ్బరాజు
రెండవ తనయుఁ డఖండగాయకకవి
త్వప్రాభవుఁడు రామబ్రహ్మమంత్రి
మూడవసుతుఁడు సమ్మదితధాత్రీనాథ
సంస్థానవర్తి కృష్ణయ్యమంత్రి
నాల్గవతనుజుఁ డనన్యసామాన్యని
త్యకవిత్వవిదుఁడు ముత్యముబుధుండు
జననిజనకుల పుణ్యలేశంబులిట్లు
భాసురకారపుత్రరూపములఁ గాంచె
ననుచు జనములు కీర్తింప నలరి రిలను
గోత్రముని కాశ్యపుని కీర్తి క్రొత్తలెత్త॥ 33

గీ॥ వారిలోఁ గృష్ణమంత్రి ప్రాభవము నంది
యలరి వేంకటలక్ష్మమ యందుఁ బుత్రుఁ
గాంచెఁ గోటీశ్వరుని దానకలితహస్త
పద్మ గణికపదస్థితు భవ్యచరితు॥

ఉ॥ తమ్ములు మువ్వు రాశయహితమ్ముగ ధర్మనయార్థగమ్యమా
ర్గమ్మున భ్రాతృభక్తివిధురమ్ముగ వర్తనసల్పుచుండఁగా
సమ్మదితానవద్యవిలసద్యశుఁడై తగ నబ్బరాజు త
ధ్యమ్మగు నబ్బ! రా జితఁడె యంచును వారలు సన్నుతింపఁగన్-



సీ॥ శరభరాజీయాది సద్గ్రంథనిర్మాత
శరభరా జేతన్వి జనకుతండ్రి
వైద్యకళాకలాపప్రాయుఁడా కోటి
లింగసుధీరుఁ డే లేమ తండ్రి
కవితాభిషక్సమగ్రజ్ఞానసంశోభి
పిచ్చయ్య సచివుఁ డే వెలఁదితమ్ముఁ
డార్యసంస్తవనీయచర్యాభిరామమహా
తుభ్యారుకుల మే వధూటినెలవు॥
పరమపదవాస నిర్మలపాదపద్మ
సేవనాలోలరూప మే చెలువ మనసు
అట్టి జగ్గాయమను బెండ్లియాడి మించె
నబ్బరాజు గభీరపయోఽబ్ధిరాజు॥

శా॥ శ్రేయోదాయకమైన మార్గములలోఁ జిత్తమ్ము హత్తించి య
న్యాయప్రాపకదుష్ప్రవర్తనములం దాసల్ విసర్జించి త
న్నాయుష్మంతులు సద్గుణాల్ వినుతిసేయన్ గీర్తినిం గన్న జ
గ్గాయమ్మన్ బతిభక్తిశీలను స్తుతుల్ గావింపఁగా శక్యమే॥

గీ॥ పరమమతులగు నాదిదంపతుల పొల్పు-
యుతుల సౌజన్యసౌభాగ్యయుతులు నగుచు
బ్రబలు జగ్గాయమకు నబ్బరాజుమంత్రి
వరున కుద్భవమైరి మువ్వురుతనయులు॥

సీ।

చం॥ తనయులు మువ్వురార్యులు సదాశివరాయలు పెద్దవాఁడు పా
వని రఘునాథమంత్రిగుణావన్మాశి రెండవవాఁడు సజ్జనా
వనుఁడగు సోమసుందరుఁడు ప్రాజ్ఞుఁడు మూఁడవవాఁడు గాఁగఁ గీ
ర్తినిగడియింప సాగిరి సుకీర్తవనీయ యశోఽభిరాములై॥

తే॥గీ॥ కామమయు నఖిలాండాంబికయును రత్న
మాంబయును రంగనాయకమ్మయు మఱి శశి
రేఖమలు పుత్రికామతల్లికలు గాఁగ
జగ్గమాంబాబ్బరాజు లుచ్చతను మనిరి॥

చం॥ పతి పరలోక మేగఁ దన బాలుర వృద్ధికిఁ దెచ్చి విద్యయుఁ
చతురత నభ్యసించుటకు సాయమొనర్చి వివాహకార్యముల్
వితతశుభంకరంబుగ నవేలముదంబున సల్పి కీర్తిసం
గతయయి ప్రాజ్ఞలౌ ననగఁ గ్రాలెను జగ్గమసాధ్వి ధన్యయై॥

గీ॥

గీ॥ రామస్వామితనూజను
ఆ మాణిక్యాంబ బెండ్లియాడెను విద్యా
కామి సదాశివసచివ
గ్రామణి గీతైకవిద్యఖామణిగుణియై॥

ఉ॥

మ॥ పతిసేవాపరతంత్రభాగ్యమహిమ లోపంబై చనన్ భక్తిస
న్మతియై మించి సదాశివాంఘ్రియుగ చింతన్ బూని తన్నామమే
గతి యంచున్ జపియించుచున్ దలమయున్ కాంతాజనానందవ
ర్ణితచారిత్రవిశేషయై వెలసె మాణిక్యాంబ సచ్ఛీలయై॥



కం॥ శ్రీసోమసుందరుఁడు గుణ
భాసురుఁడై ముత్యమనెడి ప్రాజ్ఞునకు దయా
వాసునకు దత్తుఁడై కవి
తాసంగతిఁ గాంచి కీర్తిధనము గడించెన్॥

గీ॥ సోమసుందరరాయ విశుద్ధచరితుఁ
డధికప్రీతిని శేషగిరమ్మ నెలమిఁ
బెండ్లియై తోడి యువకుల వినతులంది
హూణరాజసభోద్యోగయుక్తుఁ డయ్యె॥

ఉ॥ రెండవ సూనుఁ డార్యనుతరీతియుతుండు రసాభిరామవా
జ్మండనమండితుండు రఘునాథసమాఖ్యుఁడు కీర్తికామినిన్
నిండు ముదంబుతో జగము నిండ నటింపఁగఁ జేసె నీసుధీ
రుండె కృతిన్ గొనెన్ గవివరుల్ తను శ్లాఘనమాచరింపఁగన్॥

చం॥ సరసుఁడు వ్యావహారికవిశారదుఁ డాంధ్రకవిత్వతత్త్వభా
స్వరుఁ డతిధార్మికుండు విలసత్తరవైద్యవిశేషవేది సు
స్థిరశివభక్తితత్పరుఁడు ధీవరుఁడౌ రఘునాథరాయఁ డి
ద్ధర దనకీర్తిచంద్రికల దాల్చి దిశల్ ప్రభ లీనుచుండఁగన్॥

మ॥ వరమాతామహదుగ్ధవారినిధిభాస్వద్రత్నమై సత్కులా
భరణంబై పతిపాదభక్తిఁ గల యంబాయమ్మ సాధ్వీమణు
ల్వరఁ బెండ్లాడి సమస్తసౌఖ్యముల గొప్పన్ మించి సంతోషవి
స్ఫురణన్ సత్యవతీకుమారికను విమ్మల్ మీరఁ గాంచెన్ ధరన్॥

షష్ఠ్యంతములు.

కం॥ సరసాగ్రేసరునకు భా
సురకవితాభావలోలశుభగమనోజ్ఞాం
తరునకు ధర్మకళావి
స్తరునకు వ్యవహారధర్మతత్త్వజ్ఞునకున్॥

కం॥ ధీరస్తవనీయకళా
సారాచారాభిరామసౌజన్యునకున్
పారావారగభీర
స్ఫారునకున్ సుకవివినుతసద్ధర్మునకున్

కం॥ నిరవద్యభక్తిశీలున
కురుతరశంకరపదాబ్జయుగళీసేవా
పరిబద్ధహృదయపద్మున
కరిహితకరవర్తనున కహంశూన్యునకున్॥

కం॥ శ్రీరఘునాథసమాహ్వయ
సూరిప్రజవర్ణనీయశుంభత్సుగుణా
ధారునకు జగ్గయాంబా
నారీపుత్రునకు సుకవినందితమతికిన్॥

వ॥ అభ్యుదయపరంపరాభివృద్ధిగా నా రచియింపంబూనిన చంద్ర
హాసచరిత్రమునకుం గథాక్రమం బెట్టిదనిన॥

# చంద్రహాసచరిత్ర.

## ప్రథమాశ్వాసము.

## కథాప్రారంభము.

చం॥ ధరణిం గలట్టి పట్టణవితానము లందున నగ్రగణ్యమై
సరసుల కాటపట్టయి ప్రశస్తసమస్తసువస్తునిస్తులా
కరమయి భర్మహర్మ్యమణికాంతిసమన్వితదిక్ప్రదేశమై
కరము వెలుంగు శ్రీపుర మగణ్యతరప్రమదానివేశమై॥

చం॥ ధరణిసురాగ్రగణ్యులు విధాత్రుని మించు సమస్తవిద్యలన్
బురహరు మించు నిశ్చయము భూపకుమారులు శస్త్రయుక్తిం గ
న్నరపతి మీఱు ద్రవ్యకలనంబున వైశ్యులు మించు రాదు, శ్రీ
హరిపద మౌటు ధాన్యనిచయాళి హలాంకుని మించు పాదజుల్॥ 2

సీ॥ తోటలా సరసంపుఁదేటలా నవకంపుఁ
బాటలా నెల్వారు తేటులలరు
పేటలా కొమరైన బాటలా సొగసైన
చోటులా సౌధాళికోటు లలరు
చేటులా యందంపు బోటులా సరసంపు
పాటులా నృత్యంపు నీటులలరు
కోటలా సద్భటకోటులా జవయుత
ఘోటులా సుద్ధిమాట లలరు

నవనవవిలాసభాసుర వివిధభాగ్య
నిరుపమానంబు విదళితసురపురంబు
శ్రీపురం బొప్పు లక్ష్మికిఁగాపురంబు
ఆపురమునకు సాటి రా దేపురంబు ॥

చం॥ అతులితహర్మ్యభాగముల యందుఁ జరించుచుఁ జంద్రికానిశా
వితతులలోఁ బురాంగనలు వేడుకకై శశిలోని జింకకున్
కృతకతృణాంకురంబులఁ జిగిర్చెడి గారుడరత్నభూషణ
ప్రతతిని జూపి తోడిచెలువల్ నగఁ దామొనరింత్రు హాసమున్ ॥

చం॥ పురవరసౌధశుభ్రరుచి పూగముతోఁ బడమేనికాంతి చు
ట్టటీకము సల్ప సారెకుఁ దబాలున దూఱి గవాక్షమార్గమున్
బోఁపోరి సోఁగు చందురుని ముగ్ధులు గైకొన హస్తనైల్యబం
ధురమలినాంకుఁడయ్యె ననఁ దోఁచుఁ దదంతరనీలరుక్ఛటల్ ॥ 48

చం॥ పొలఁతుల యూర్పుతావులను బుట్టువు నొంది దళత్సరోరుహా
బులకదవృద్ధినంది పురపుష్పవనీరమణీయశాఖికా
స్థలముల నాటి తేటి తనుదాన దిగంతరమధ్యవర్తియై
మలయసమీరమా పురరమాపదిచర్యయొనర్చు నిత్యమున్ ॥

ఉ॥ ఆ పురమేలు మేలు భళియంచు జనుల్ నుతియింప నీతిశా
స్త్రాపనయప్రభుత్వకలనాయుతసత్యసుచిష్ఠియుండు ధై
ర్యాపరకాంచనాద్రి సుజనావనుఁ డంచితసద్గుణుండు సీ
తాపతిభక్తుఁ డొప్పు బహుధావిజయాఖ్య వహించి మించుచున్ ॥



ఉ॥ ఆతనిమంత్రి దుర్గుణగణాకరుఁ [illegible]
ధీరజనాపకారకృతదృష్టి [illegible] దురా
శాతతబద్ధచిత్తుఁడు ప్రజాపరిపీడనవర్తనుండు [illegible]
ద్భ్రాతల [illegible] దుష్టబుద్ధి [illegible] ॥

చం॥ అతఁ డొకనాఁడు [illegible]
యతులును [illegible] వెలగ నుండియు ముద్దులాడుచోఁ ద
త్సుతు [illegible] దం
[illegible] ప్రసిద్ధత [illegible] ॥

సీ॥ కలువరాయని లేకగతిఁ [illegible]
బాదలించు [illegible]
చిరునవ్వునునుగాంతి [illegible]
విదలింపఁ జాలు [illegible]
కడకంటి [illegible]
గడు [illegible]
[illegible]
[illegible]

గీ॥ వెడఁదనై పీనమై [illegible]
వరలు శుభకరమైన [illegible]
గన్నులకు విందు [illegible]
గూర్చు నచ్చాలు [illegible] ॥ 52

కం॥ చెలువములకు గని యగు నా
యెలఁ బ్రాయపుఁ గుఱ్ఱవాని కేలిక యెవరో
తలిదండ్రు లెవ్వరో యది
తెలియఁగ రా దతని చెలువు దృక్కులఁ దనుపున్ ॥

చం॥ తమకడ కేగుదెంచిన సుధానిధిఁ బోలిన మోమువాని శ్రీ
రమయిలు నా విశాలమగు రాజిలు వక్షమువాని రాజచి
హ్నములఁ జెలంగువాని శుభ నాయతనేత్రయుగంబువాని చి
త్రములను మెచ్చు జోస్యుల విధంబును గన్గొని మంత్రి యిట్లనున్ ॥

గీ॥ నాసికల వ్రేళులుంచి విన్నాణముగను
చూచుచుంటిరి చిత్ర మిచ్చోట నేమి
కల దటన్న నమాత్యముఖంబుఁ గాంచి
పలికి రిట్టుల మర్మసంకలితఫణితి ॥ 56

చం॥ మనసిజునేలు నవ్యసుకుమారతరాంచితసుందరత్వమున్
వనజవిశాలలోచన శుభంకరవన్మ్ముఖమండలంబునున్
గనుగొని మెచ్చుకొంటి మనగా నివి గాదు వచింపుఁ డంచు వా
రిని బలవంత పెట్టి వివరింపుఁ డటంచును మంత్రి కిన్కతోన్ ॥

గీ॥ క్రూరుఁడగు వీని దశఁ గలకాలము పలుకఁ
గలుగు నీ పసివాని కిక్కటులు కొన్ని
నిజము వచియింప కున్న మన్నింప డితఁ
డంచు దలపోసి జోస్యు లిట్లనిరి ప్రీతి ॥ 58



చం॥ తమకడఁ దాపఁగా దరమొ ధాత్రిపసత్సభమంత్రిశేఖర
త్వమునఁ జెలంగి మాదృశుల బాలన సల్పు ప్రధాను లౌట స
త్యము వచియింతు మీ శిశువు నందునఁ గల్గిన రాజచిహ్నముల్
భ్రమ గలిగించె నీతఁ డొక పట్టున నిర్వరి నేలు యోగ్యుఁడై ॥

చం॥ అని వచియింపఁగా హృదయమందున శూలము గ్రుచ్చుకొన్న భా
తిని కడు గష్టమైన వెలితిన్ బచరింపక పేర్మి జోస్యులన్
గనుగొని వీని జాతకమునన్ మన రాజ్యరమాపురంధ్రి యీ
తని వరియించు రీతి కలదా! యటులేని వివరింపఁ గాఁదగున్ ॥

కం॥ అని యిటు పల్కిన మంత్రికి
వినుపించిరి జోస్యులిట్లు పృథ్విపచిహ్న
వను డీబాలుం డాపద
లను గాంచఁడు సౌఖ్యముగఁ జెలంగును సుమ్మా॥ 61

మ॥ అని జోస్యుల్ వచియించు వాక్య మది శూలాకారమై శ్రోత్రప
ళిని గాడంగను గ్రుచ్చి నప్పటికి జాలింపించి యవ్వారలన్
జనఁగా నాజ్ఞ యొసంగి యేకతము చింతన్ మున్గి యీరాజ్యల
క్ష్మిని పాలింపఁగ నన్యుఁ డర్హుఁడగు భంగిన్ గాంచి సైరింతునే

సీ॥ విజయుసామ్రాజ్యంబు నిజపుత్రు భుజపీఠి
నలరారు నరయును దలఁచు చుంటి
శ్రీపురరాజ్యలక్ష్మి సాదరముగఁ బతు
నేను తావలమని యెంచుచుంటి

జెగ్గుబుజుంజురు పల్లవెండ్రుకల్ కనరాని
లాగున వెడఁద కుళ్లాయిపెట్టి
ఏపి కంబపు రీతి హెచ్చైనర్వఁగఁ జాలు
కరమున నోరగల కత్తినూని

గీ॥ తాళభూమీజము లనఁగఁ జాలి నట్టి
దీర్ఘతరకాయములు గల దిట్టలిర్వు
రెసఁగ మెసఁగెడి ముదమున నేగుదెంచి
రెలమితోడ నమాత్యుని గృహమునకును॥

కం॥ చేరిన తలవరులన్ దయ
వారన్ గని బాలుఁ జూపి ప్రౌఢత మీరల్
దీరుప వలె నీవధ నె
వ్వారలు గనకుండు నట్టి వైఖరి తోడన్॥

ఉ॥ నిద్దుర నందు బాలుని వనీస్థలి చేరెదు నంతదాక మీ
రొద్దిక సందడింపక ప్రయోజనమున్ బొనరించు టొప్పుగా
కుద్దవిడిన్ వడిన్ కలఁత నొందియు మేల్కొనెనేని కీడు మీ
వద్దకుఁ జేరు జాగ్రత కృపాపరతంత్రతఁ బూన హానియా॥

చం॥ చనుఁడన బాలుమంచమును జయ్యన మూపులపై ధరించి త్రో
వను విడి దొంగదారి బడి పాదములెల్లను గాడు కంటకా
ళిని గడు బాధనొందు చవలీలను ఘోరతరాంధకారభా
జన మతిఘోరవన్యమృగసంకులమౌ వనసీమఁ జొచ్చుచున్॥



సీ॥ ఘోరసైంహికవారసారభయావహ
గర్జాధ్వనులఁ గొంత కలఁత వడుచు
అశనదిదృక్షాక్షిపితనైకశార్దూల
జాలనిస్వనముల సడలు వడుచు
భీకరపైశాచికాకృతసంకుల
కోలాహలంబులఁ గూల వడుచుఁ
గాలకూటవిషాగ్నికలితాహినిశ్వాస
వాయుతాపంబుల వాలఁ బడుచు

గీ॥ ఫేరునిష్ఠురసంరావవికటసంగ
తైకపృథుకస్వనంబుల నడలు వడుచుఁ
గంటకద్రుమగుహాకుడుంగగాఢతాడి
తావయవు లౌచుఁ జేరి వనాంతమందు॥

ఉ॥ అంధుల బోలియున్న మన మాచరణంబు నొనర్చు టెట్లు వే
యింధన పాళి నేరికొని యిచ్చట ప్రోత్సాహరించి యగ్నిసం
బంధము గల్గఁ జేయఁగ సమంజసమౌ తరువాత బాలునిన్
స్కంధవిహీనుఁ జేసి చనఁ గల్గుదు మంచుఁ దలంచి యెంతయున్

గీ॥ ఇంధనంబులు గొని తెచ్చి యందు వహ్ని
రగుల జేసియు వెల్గుదుగాఁ గనిరి
తలవరులు మన్మథాకారు లలితచంద్ర
హాసు సచ్ఛీలు మృదులగుణాలవాలు॥

చం॥ కనుగొని యంత లోపలను గాఢభయార్ద్రమనస్సరోజులై
ఎనసిన ప్రేమ ఖడ్గములఁ బృథ్విపయిన్ బడనేసి కొంతసే
పునకు వనమ్మునన్ మఱచి పూనిన కార్యము నిర్వహించి యే
యనువునఁ బోవనేర్తు మని యాంతరసీమ వితాకు నందుచున్

ఉ॥ మంచియుఁ జెడ్డయుం దనెడు మాట నెఱుంగఁడు గిల్లఁజెక్కులన్
గుంచెడు పాలు గారు ననుగున్ శిశుతన్ జెలువారు చున్నవాఁ
డంచిత గాత్రుఁ డెట్టులఁ గరాసిని గుత్తుక కోయ నౌను యీ
పంచశరాంచితున్ సుకవివర్ణితచారువయోవిలాసునిన్॥

ఉ॥ జీవము తోడ నున్నఁ బరిశీలన జేయుచు సజ్జనాళికిన్
దావల మై సమస్తవసుధాపరిపాలనమాచరించి దు
ర్భావులఁ జెండి ధర్మము విరాజిలఁ జేసి యశంబు చెంద నౌ
శ్రీవిభవాస్పదం బయిన చిహ్నాలు గన్పడె బాలుఁ జూచినన్॥

కం॥ అని యొకతలవరి బాలుని
గని పల్కెన యొండొకండు కటునఖ్బరమున్
గని వెల్గున దినమణియన
గను నొప్పెదు బాలుముఖము కని కరమొదవన్॥

ఉ॥ ఇంతటి ప్రేమ నెమ్మదిని నెన్నఁడు పొందను మత్కరాసిచే
నింతకు నెంతముంది తెగి రిమ్మొడఁ జింత యొనర్ప నేల నే
పొంతకుఁ బోవ నెంచఁ బదముల్ వణకం[illegible] సాగ నార వ
న్యాంతరమాదు డించి చట నొల్లఁ దలంకుసుమీ క్రమంబుగన్॥



ఉ॥ గోణమునైనఁ దాల్చు తెరగున్ గన డీఁశిశు విప్లు గావునన్
ప్రాణముఁ బాపుఁ డం చిటులఁబల్కఁగఁ గారణ మేమియొక్కొ పా
షాణముఁ బోలు నెమ్మది విచారముఁ గూర్పదె విన్నవారు వి
న్నాణము నందరే మునమునన్ గృప వీడుట పాడి యౌనొకో

కం॥ కఱకుకరాసిని శిరముల
నఱికితి మిచ్చోట మనమునన్ గృపఁ గననే
కఱవౌటను నీ బాలుని
తెఱగున కార్ద్రిత వహించి తెలివిడి నైతిన్ 85

సీ॥ మంచియుఁ జెడ్డయున్ మాట యెఱుంగని
శిశు వపకృతి యేమి చేసె నొక్కొ
ఒక చెంపఁ బాలు వేఱొక చెంప నెత్తురు
వెలయు బాలుం డేమి సలిపె నొక్కొ
తల్లిదండ్రుల పేదతనమున నడయాడు
పిల్లఁ డేచిక్కులఁ బెట్టె నొక్కొ
అన్నవస్త్రములకు ననదయౌ పసివాఁడు
తన కెట్టి యిక్కటుల్ దార్చె నొక్కొ

గీ॥ అర్ధరాత్రంబు నందు మహాంధకార
బంధురాటవిలోఁ జంపఁ బూనుటకును
కరుణ హృదయంబు నందునఁ గలదొ లేదొ
చండదుష్కార్య పరునకీ సచివమణికి 86

మ॥ తల వఱకుర ఢటంచు నటఁ దాను కృపారహితాశయుండునై
పలుకును గాక నంతటనె బాలుని దీనునిఁ జంపఁ బూను చేఁ
తలకుఁ గిరంబు లాడునె వృథాగను దోషవిహీనుఁ డౌట చేఁ
గలఁక వహించె వీని పిడఁగా హిత మంచును బల్కి వెండియున్

గీ॥ హత్య యొనరించి యీనవా లవయవంబు
లందు నొకదాని తెమ్మని యాజ్ఞ యొసఁగెఁ
గాదె చంపక యున్నచోఁ గలుగు టెట్లు
చిహ్న మంచని మదిలోనఁ జింతఁ జేసి 88

ఉ॥ బాలునియంగముల్ గెడపి ప్రాణముఁ బాపక బాధ నుంపఁగా
మేలొకొ చిహ్నముల్ గొనక మేము జనన్ సచివుండు కోపియై
కూలుచు మమ్ము నెట్లయినఁ గొల్వదు చిత్తము వీనిఁ జంప మా
యేలిక హత్యనమ్మగతి నిశిశురక్షణ చేయు టెట్లొకో

తే॥గీ॥ అంచుఁ దలపోసి బాలుని యవయవంబు
లందు దృష్టిని నిగిడించు నంతఁ బాద
తలమునం దారు వ్రేళ్ళుంటఁ దెలిసి చిత్త
మందు నాయురుపేతుఁ డం చలరి యంత 90
బ్రతుకుమీ జీవుఁడా యని పాదమునను
గల్గు మిక్కిలి వ్రేలును గత్తిచేతఁ
గోసి తా మానవాలుగాఁ గొనుచు బాలు
నీమ మెంచియుఁ బ్రార్థన చేసి రిట్లు



ఉ॥ ఘోరతరాటవిన్ శిశువొకొండె వసింపఁగ నుండె వీని నీ
చారుకృపాప్రభావమున సాఁకి యనుగ్రహమున్ వహించి యీ
ధారుణిపైని వత్సరశతంబు వసింపఁగఁ జేసి కావ వ
య్యా! రఘురామచంద్ర! భవదంఘ్రియుగంబులు సంస్మరించెదన్

గీ॥ కరిని బ్రోచిన వేల్పవు గాన వంత
గాంచు ధ్రువుఁ బ్రోచినట్టి యఖండమతివి
చిఱుత నీకుఱ్ఱవాని రక్షింపుమయ్య
మానిసంచయగేయ రమాద్వితీయ 9

ఉ॥ తారలు కాంతిమాయ జనతండము నిద్రలఁ బాయ పక్షు లెం
తే రహిఁ గూయ చీఁకటులు తేజము వాయఁగఁ గల్వ దాయ తా
మారపుఁ గొండ నెత్తములఁ దొల్లటి సంజ వెలుంగు రంగు సిం
గారము గ్రింపఁగాఁ దొడఁగెఁ గార్మొయిళుల్ గన నూతనచ్ఛవుల్

చ॥ తెలతెలవారె దిక్తటులు తేజముఁ బూనెను ఘోరసత్త్వముల్
తొలఁగి గుహాళిఁ జేరఁ జనెఁ దోయజముల్ వికసించె సర్వజీ
వులు తెలివిన్ వహించిరి విభూతివిధంబునఁ దారకాచ్ఛటల్
కల తొలఁగెన్ గ్రమక్రమముగాఁ దొలఁగెన్ వితతాంధకారముఁ

ఉ॥ సంగడికాఁడు వచ్చె నిఁక సాగవె యాటలటంచు నెంచి క
న్నుంగవపైని కాటుక వినోదముగాఁ బచరించి కుల్కు చ
న్నుంగవపైని బైటనిడి మాల్నెరంగ వెలుంగ నేగు త
న్వంగుల రీతి పంకరుహవారము నీరము నందు భాసిలెన్

చ॥ గరులు విదల్చుకొంచుఁ బతగంబులు త్రిమ్మరసాగె భూజపుఁ
దొరటులలోన ఘూకములు దూరఁగసాగె మృగేశసంఘము
ల్గిరిగుహాలందు మత్తువఁ జలింపక నిద్దురఁ బోవసాగె భా
స్కరుని సహాంశుమండలిని గప్పఁగ సాగెను తైత్తమిత్త్రికన్

చ॥ కలితపయోజరాగములు గా నొక కొంచెము సేపు మౌక్తికం
బులుగను గొంతసేపుఁ గపుపొల్పగు బారదమట్లు కొంతసే
పల వనజాతబంధుఁడు నిరంతరవృద్ధిని గాంచుచుండఁగా
జలరుహపత్త్రవారికణసారరుచుల్ కనుపట్టె నెంతయున్

॥ ఇట్లు తలపోసి తలపోసి యీశ్వరేచ్ఛ
కాలఁది జరుగును చేచేత కుట్టఁజంపు
కంటు నివ్వాని డించుట కర్జమంచు
నట్లొనర్చియుఁ జనిరి గృహంబుఁ జేర 99

॥ అటు చారుల్ చనినంత ఘోరమృగజాలాభీలరావావృతా
ర్భటులన్ బెగ్గిలి యేడ్చి బాలుఁడు దిశాభాగాళి మాఁగోన్నియను
త్కటతాన్వనము నాలకించి పలిచెన్ తత్క్రూరవన్యాళులా
చాటు వే వీడియు నీశ్వరామలకృపన్ శుద్ధాంతరంగంబునన్

॥ ఘనతరకాననాంతరము కన్నులు గానని యంధకారముల్
పెనగొనఁ బుండరీకముఖభీకరఘోరదురారవార్భటీ
జనితపృథుధ్వనుల్ భయవశంవదుగా నొనరించు ధైర్యవం
తుస నపు డిట్టి బాలుగని తోఁపక యుండున పాతకాళికిన్



గీ॥ ప్రాగ్భవంబున నెటువంటి పాపతండ
ముల నొనర్చెనో యేమొకో తెలియఁబోదు
కాని కడుబాల్యమున నె జగంబునందుఁ
గలుగఁ బోవని యిక్కట్లు కల్గెఁ బెక్కు 102

మ॥ తను నోదార్చెడి వారు లేమి వనసత్వక్రూరసంరావసం
జనితప్రస్ఫుటభీతిఁ బాదమున నిచ్చల్ గల్గు పెన్ బాధయున్
పెనగొ నేడ్చుచు నుండె నేలఁబడి యొంతేఁ డాఁ బదార్వన్నెకాం
చనమున్ బోని శరీరకాంతులు రజచ్ఛన్నంబులై మించఁగన్

తే॥గీ॥ దిక్కు లేనట్టి వారికి దేవదేవుఁ
డొక్కఁడంటను దిక్కుగా నుండికాచు
ననెడి లోకోక్తి నిశ్చయ మయ్యెజుండు
బాలుఁ డాపద లొందవక బడలకుంట

కం॥ అర్భకుఁ డాయటవీస్థలి
నిర్భరకష్టములతోడ నెమ్మది పొగులన్
దుర్భరవేదన గను సం
దర్భమ్మున రవి నభఃపథంబునఁ గ్రాలెన్ 105

ఉ॥ శ్రీపురరాజ్యలక్ష్మికిని జేరిక కప్పముఁ గట్టువాఁడు ది
గ్వ్యాపితకీర్తి సద్గుణగణాత్తచరిత్రుఁ డుదారమానసా
ద్దీపితుఁ డార్యపూజితుఁడు ధీవిభవుండు పుళిందనాయకుఁడున్
కాఁపురముండు కోణకటకంబును నేలుచు సత్యసంధుఁడై

సీ॥ పౌరావళిని గాన్నభంగి పాలించుట
రామరాజ్యం బనరాదె యంచు
దానధర్మముల సతం బొనరించుట
కల్పభూజం బనఁ గాదె యంచు
ఈతిబాధాప్రమాదాతిశూన్యం బౌట
సత్పాలన మనంగఁ జనదె యంచుఁ
బ్రవిమలసాద్గుణ్యవర్తన గల్గుట
ధర్మరా జని పిల్వఁ దగదె యంచు
గీ॥ వినుతి యొనరింప నెగడె సద్వీపులబాహు
బలవిరాజితవిక్రమప్రాభవుండు
వైరిసంహారచణసముద్ధారివిజయు
కాంతుఁడైన పుళిందసామంతనృపుఁడు 107
ఉ॥ ఆతనిజాయ నాథునిపదాంబుజముల్ మదినిల్పి సేవలన్
బ్రీతిని జేయు చాపులను బ్రేమను గాంచు ధరన్ బతివ్రతా
ఖ్యాతలలో శిరోమణిగ నంచితకీర్తి ధరించి మించె తే
జోతిశయంబు ధార్మికగుణాతిశయంబు తనన్ వరింపఁగన్
కం॥ ఆయమ నెమ్మనమునఁ జిం
తాయత సంతానవాంఛ దరికొన భర్తన్
గాయజసమనవమోహను
నాయెడఁబొడఁగాంచి తెల్పె నాత్మవ్యథలన్ 109



ఉ॥ వాసన లేని పుష్పమును, భావము లేని కవిత్వశైలి, వి
శ్వాసము లేని బంటు, బుధవర్గము కల్గని యోలగంబు, వి
ద్యాసరసం బెఱుంగని ధనాంగనయున్, గోమరుండు లేని సు
శ్రీసముపేతుజీవనము, చెందును వ్యర్థము నండ్రు కోవిదుల్
తే॥గీ॥ సారశృంగారకలితసంసారవల్లి
నుదయ మందిన ఫల మనియెదరు పుత్రు
ఫలముఁగాంచని తీఁగ కైవడిని సుతుని
గనని సంసారమును వ్యర్థకారణమ్ము 111
ఉ॥ ఇవ్విధి మానసవ్యథల నెల్ల వచించి విచారమందు నా
జవ్వని చెంతఁ జేరి యల క్ష్మాతలనాథుఁడు బుజ్జగించి నీ
నెవ్వగ మానుకొమ్ము తరుణీ సుకృతాతిశయంబు లేనిచోఁ
బువ్వులు ముల్కులౌను గద పుణ్యఫలంబు లలంఘ్యముల్, గదా
ఉ॥ నోములనోచి వేలుపులనున్ బరితృప్తుల సల్పి దేవతా
స్తోమసపర్యలన్ నెరపి సూరికదంబము నాశ్రయించి గా
థామృతపానమున్ సలిపి యన్వయపావనమున్ బొనర్చు చు
న్నామ రమేశుఁ డెట్టులఁ గనందు సుతార్థుల నన్ను నిఁక సఖీ!
కం॥ అని యోదార్చి ప్రభువరు
వినియోగము వలన నేఁడు పృథ్వీపాలున్
గన బోవలెఁ ననుసంగతి
మనమున స్ఫురియింపఁ బల్కె మగువకుఁ బ్రీతిన్ 114

చ॥ తలఁగకు మేను భూధవుని దర్శనవాంఛను బోయి వేగ ని
మ్ముల నరుదెంచు వాఁడనని ప్రోల్పుగఁ దాఁ బరివారయుక్తుఁడై
వెలలియు శ్రీపురంబుఁ గని వేడుకఁ దత్ప్రభుసత్సభాస్థలిన్
గలపను లెల్లఁ దీర్చి నిజనాథునిమన్నన లంది యంతటన్

కం॥ సెలవున్ గైకొని మిత్రుని
వలనన్ గైకోలు వడసి మించిన వేడ్కన్
జెలువారుచు నిజపురికై
యలరఁగఁ బరివారయుక్తుఁడై చనసాగెన్ 116

వ॥ ఇట్లు కతిపయప్రయాణంబుల సాగి నిజపురాభిముఖుండై

మ॥ కనియెన్ సాలరసాలపాటలశమీకారం బపిండీకరో
చనబిల్వామ్లశమీరతిష్యఫలవిష్వక్సేనవింశాభయా
పనసాశోకంబుజకర్ణికారగణికాథస్మేర శేఫాలికా
ర్జునహింతాలజయూదరీశదశకభూరుడ్యాదికాంతారముల్

మ॥ పరివారంబులు తోడఁ రాఁ దరిసి సంభావించి సంతోషసా
గరలోలాత్మపరీతుఁడై యడవి చక్కన్ జూచి యాపైని దా
నొకుఠన్ వచ్చు నటంచు నెంచి తన నెయ్యాపున్ సఖున్ బిల్చియా
తెరఁగెల్లన్ వచియించి నాతఁ డటులౌ తేసేయఁగాఁ బంచినన్

కం॥ విడిఁదికి ననువగు స్థలమున్
దడయక కని యచట విడియఁ దగుననె డేరా
గదియించి సువాసమ్ము న
ఖదగతి చేయుంగ సేవకాతతి బూనెన్ 120



చ॥ పరిసరభూములన్ గలుగు వన్యకుజామలసుందరప్రభా
నిరతిని జూచి వత్తుమని స్నేహితుఁ జేరియు వెంటరా వనాం
తరమున కేగె నాతఁడు ముదంబున నచ్చటి చిత్రలీల దా
మరయుచు సంచరించు నెడ నార్తనినాద మొకండు దోఁచినన్

కం॥ తలపఁగ నిర్మానుష్యము
కలితాధికవన్యమృగవికారము సభయా
కుల మివ్వన మిటఁ గనవినఁ
గలిగెడు రోదనము దీని కారణ మేమో! 122

చ॥ అని తలపోసి యాతఁడు వనాంతరమందున రోదనధ్వనిన్
వినఁదగు నాప్రదేశమును స్నేహితుఁ దోడ్కొని పోయి గాంచె బా
లుని రుధిరప్రసిక్తపరిలుప్తతరాంగుళుఁ జంద్రబింబశో
భనవసుందరాస్యుని స్వభావకళాకలితాభిరాము నిన్

ఆశ్వాసాంతము

---

ఉ॥ కంజభవాన్వయాంబునిధికంధితనూజతనూజవైరిప
త్కంజసమర్చనాయితజగద్ధితమానసమానసార ధీ
రంజితకావ్యరాజరసరమ్యపదార్థవివేచనాలస
న్మంజుల శేముషీమహితమంత్రిహితంకర భవ్యవర్తనా

మాలిని

సుగుణగణవిశాలా స్తుతసద్భక్తిజాలా
నిగమహితమనస్కా నిత్యభాస్వద్వచస్కా
విగతరిపుసమూహా విజ్ఞతాసత్ప్రరోహా
అగణితజనగేయా హారిలక్ష్మీవిధేయా

ఇది శ్రీ శేషాచలాధీశ చరణసేవాసమాసాదితకవితావిచిత్ర
దూపాటివంశపారావారరాకాసుధాకర
శేషాచార్యపౌత్ర వేంకటరంగాచా
ర్యపుత్ర శేషాచార్యకవిమిత్ర
ప్రణీత చంద్రహాస
చరిత్రమునఁ
బ్రథమాశ్వాసము





# చంద్రహాసచరిత్ర.

## ద్వితీయాశ్వాసము.

కం॥ శ్రీరమణీరమణకృపా
భూరిస్థితనిఖిలసుకవిబుధజనగేయా!
పూరితసుగుణామేయా
ధారా! రఘునాథరాయ! ధర్మవిధేయా॥

గీ॥ అవధరింపు పుళిందధరాధిపాళి
సఖునితోఁ దత్ప్రదేశంబు సరసకఱిగి
తచ్ఛిశువుఁగాంచి మదిని నత్యంతముదితుఁ
డై తలంపఁగ సాగె నిట్లనుచుఁ బ్రీతి॥ 2

సీ॥ సంపూర్ణపూర్ణిమా చంద్రమండలశోభఁ
జెలువారు నీబాలు చిన్నిమోము
పదియారువన్నెల పసిడిచాయలు దేరి
తేజరిల్లెడు బాలు దేహకాంతి

కంతుజయాంతు లెక్కఁ జేరనీయక
మిక్కుటంబగు బాలు చక్కఁదనము
అనితరసుకుమారహారిపేశల మౌచు
నలరారె నీబాలు నంగపాళి
బింబఫలకాంతిఁ దెగడెడి పెదవిసారు
రాజలక్షణలక్షితప్రతిభ గలిగి
నిర్మనుష్యము సంకులనిఖిలసత్త్వ
మీ వనంబున నిటులుండు టేమి యొక్కొ॥ 3

గీ॥ ఘోరశార్దూలసింహసంకులము త్రస్త
ధావదేణీకులంబు పతన్మహీధ్ర
గండపాషాణశకలమౌ కాననమున
నొంటి నిబ్బాలుఁ డెటులుండె నొక్కొ దలఁప॥ 4

మ॥ పది మాసంబులు మోసి కష్టపడి యోర్పన్ రాని పెన్ వేదనల్
గదియన్ సైచియుఁ గన్న యీజనని నిర్లజ్జావినిర్మోహియై
పొదలన్ ద్రోయఁగ నొప్పునే హృదయమేమో చిత్రమైతోఁచు న
మ్మది కెవ్వారొ దురూహ బాలునిటు జంపం ద్రోచి రిచ్చోటునన్॥

సీ॥ కంటకతరుగుల్మకాండముల్ శయనింపఁ
బట్టుపరుపులె నీకు భవ్యదేహ!
శ్రవణకఠోరమౌ జంబుకనినదముల్
మృదుసూక్తులా నీకు సదమలాంగ!



పరజీవహనననిర్భరసింహజాలముల్
తలిదండ్రులా నీకు దైన్యమూర్తి!
పతగసంకులవనీభాగంబు జూడఁగా
గేహసీమయె నీకు కీర్తనీయ!
కఠినపాషాణశకలసంకలితమైన
కటికురానేల నిలువఁ గాఁ గల తలంబె!
సహజసుకుమారతనుయష్టిజాలసడల
నకటకట కాన నెటులుంటి వయ్యబాల॥ 6

కం॥ అగుఁగాక నేల చింతిల
విగతాపత్యమున గుంద వీనిని దయ శ్రీ
నగధారి యొసఁగెఁ గొనిచని
మగువకుఁ దెలిపియును బెంతు మమకారమునన్॥ 7

గీ॥ పాలు ద్రావెడి బాలుఁ డేవర్ణమైన
నాత్మసూనుని వలెఁ బెంచ నఖిలవర్ణ
ములకుఁ దగునని ప్రాజ్ఞుల్ బలుక వినమె
యంచుఁదలపోసి చెలికాని కనియె నిట్లు॥

మ॥ చెలుఁడా! చూడ మదీయభాగ్యము ఫలించెన్ పుత్రవాంఛార్తినై
కలకాలంబు కృశించుచుండుటను శ్రీకాంతాధవుం డెంచి చిం
తలఁ దీర్పన్ దయచేసె బాలునిటు చెంతన్ జేర్చి గానట్టిచోఁ
గలుగన్ బోవునె ఘోరవన్యమృగవక్రాంతారమం దిట్టులన్॥

క॥ అని ఘనసంతోషముతోఁ
దన సఖునకుఁ దెలుప వల్లె తగునని యబ్బా
లుని దరిసిరి కొనిచనఁగా
మనమునఁ దలపోసి వారమందరగతులై॥ 10

క॥ వారలఁ గని బాలుఁడు కర
వారిజముల నెత్తె వాని భావముఁ గనిమో
దారభటి నప్పుళిందధ
రారమణుం డెత్తికొని పురంబున కేఁగెన్॥ 11

మ॥ పరివారంబులఁ జేరి భోజనముఖవ్యాపారముల్ దీర్చి యె
ప్డరుగంగాఁ గలవాఁడ మత్పురికి నెప్డర్థాంగి కీసూను శ్రీ
హరికారుణ్యకటాక్షలబ్ధమని మోదస్ఫూర్తిమై నిత్తు నె
ప్పురుసంతోషముతోడనొప్పుదము నెయ్యుల్ బందుగుల్ మెచ్చఁగన్॥

మ॥ ఒకచో సేనియు నిల్వఁబోవక ప్రయాణోద్యోగమున్ దీర్చి చే
రికలో నాత్మపురంబుఁ గాంచి పనిచెన్ భృత్యాళినిన్ పట్టణం
బకలంకప్రభమై నలంకరణకృత్యంబుల్ బొనర్పంగ సే
వకులున్ జల్కిరి పుత్రలాభ పృథివీపాలాగతంబుల్ పురిన్॥

సీ॥ శృంగాటకముల భూషించియు నందందఁ
దీరిచి రచ్చంబు తోరణములు
రాజవీథులు కడు రాజిల్లఁ బన్నీట
నలరఁ జల్లిరి కలయంపి మిగుల



కటకభిత్తికల చిక్కని సున్నముల్ మేది
పట్టితీర్చిరి యెర్రమట్టి యోరు
నిలయాంగణంబుల నలికి ముచ్చట మీఱ
వరలించిరా రంగవల్లు లెలమి
గవని గవనికి దేవుఁడు గాచుఁగాత
మంచుఁ గాంచనమషి వ్రాసి యలరఁజేసి
నవనవవిభూషణాంబరవివిధకుసుమ
భూషితులుగాఁగ నొప్పి రప్పురజనములు॥ 14

క॥ అంతట రవి యస్తాద్రి
ప్రాంతమునకు నేగె తమసమాశావితతుల్
దొంతరలై క్రమ్మెను శు
ద్ధాంతంబున దీపకళిక లలరారెఁ దగన్॥ 15

చ॥ ఇనుఁ డను జాతవేదుఁ డపు డివ్విధి యస్తధరాధరస్థస
ద్వనుల దహింపఁగాఁ బరగు ప్రజ్వలనప్రభయంచనంగఁ గ్ర
మ్మెను కడు సంజకావిచవి మీఱెను ధూమమనంగఁ జీఁకటుల్
జనితకణంబులో యనఁగ సత్తతి మీఱె నభస్థలంబునన్॥

సీ॥ అస్తమానుండయి యాపేక్షఁ దీరక
పలురూపముల రవి వఱలె ననఁగ
గేహభిత్తికలకు గీలుకొల్పినయట్టి
మరకతాదికజాతి మణులనంగ

చీఁకటి యను చాందినీ కమరించిన
పొలుపారు నారస బుడ్లనంగ
రాజాగమార్గమై రాజిల్లఁ జేయఁగాఁ
గ్రాలెడి పేర్ దివిటీ లనంగ
నలరె తారక లాకాశతలము నందుఁ
బ్రబలె దీపిక లాశోణపట్టణమునఁ
బౌరులమనంబు లానందపటిమ మించ
నాఁటి సంతోషవిషయచిహ్నంబు లగుచు॥ 17

కం॥ ధరణీసురవరు లిది శుభ
కరసమయం బంచుఁ దెల్పఁగాఁ బురిఁ జొరఁగా
ధరణీవరుఁ డరుదేరెను
పురకామినులున్ నివాళిపుంజము లొసఁగన్॥ 18

కం॥ రాజవీధుల నా ధరారమణమౌళి
పుత్రిసంయుతుఁడగుచును బోవుచుండ
వేడుకను గాంచ మదిని భావించిమించి
చంచలాక్షులు సౌధపార్శ్వములఁ జేరి॥ 19

చం॥ ఒక భ్రమరాభకుంతల రయోజ్జ్వలయై ప్రభుఁజూడ నడ్డమై
వికచసరోజనేత్ర లతివేలముగా నటనిల్వఁ బిల్చె నో
సకి! భవదీయభర్త యన చాన విచారముతోడఁ బోవఁగా
వికటతరాట్టహాసమునఁ బిల్చి నిలంబడెఁ దోడివారితోన్॥



చం॥ జలకము లాడఁచుండి యొక చాన ధరాధవుఁ డేగుచుండుటన్
దెలిసి కనంగ చీర కటినిన్ బిగియింపఁగ మాని చేతకం
చెల ధరియించి పయ్యెటను చే సవరింపక చూచుచుండె భూ
తలపతిసోయగంబు కనుదమ్ముల కాంతులు తాండవింపఁగన్॥

గీ॥ మహితవైభవముల రాజమార్గ మెలమి
గడచి తన రాకకై వాంఛ గడలుకొనఁగ
సినుని దర్శనమునకు పద్మిని విధమున
నెదురుజూచు స్వకాంతను గదియు కొఱకు॥ 22

కం॥ త్వరత్వర తోడుత కక్ష్యాం
తరములు గమియించి హృదయతామరసమువి
స్ఫురితముదంబున మించఁగ
సరసకుఁ జనుదెంచె విభవసాంద్రుం డగుచున్॥ 23

మ॥ అటు సామంత నృపాలమౌళి నిజసౌధాభ్యంతరస్థాన మా
ర్గ్ఘటిమైఁ జేరి సమస్తపౌరులను నిల్వంబంచి భృత్యాళి న
చ్చోటు వీడంగను నాజ్ఞలిచ్చి చెలులచ్చోఁ జెంత నేతేరఁగా
నటుఁ జేరన్ జని స్వీయకాంతదరి కత్యంతోద్ధతుల్ మీరఁగన్॥

కం॥ ఎదురెదురు వచ్చి నాథుని
పదముల గాంగేయకలశభవ్యోదకముల్
వదలుచు గడగియు మణిగణ
గదితాసనమున వసింపఁగాఁ జేయుటయున్॥ 25

చం॥ తన యయనప్రచారమును తద్వన మందున రోదనధ్వనిన్
వినుటయుఁ జేరఁబోవుటయు వేడుక బాలునిఁ జూచుటాదిగాఁ
జనిన తెరంగుఁ దెల్పి పిలుచన్ శిశువున్ దనచేతికియ్య సం
జనితముదార్భటిన్ జెలఁగె జాయమనోంబుజ మప్డు బ్రీతిమై॥

ఉ॥ దైవ మొసంగె వీనినిగదా మన కిచ్చను మెచ్చి కానిచో
యీ వనసీమ యేడ? శిశు వాయెడ నొంటిగ నుండుటేడ? నీ
భావమునం దలంపు మతివా! జనియించెడి పుత్రమోహ వహా
రా! వివరింప శక్యమగునా భగవంతుని మాయ యొంతయున్॥

ఉ॥ బాలునిఁ గాంచు టాదిగ నపత్యవిమోహము నెమ్మనంబునం
దోలి జనించె దైవమిడకున్న జనించునె ప్రేమ నేఁటికిన్
జాల ఫలించెగా తపము సంతస మబ్బె నటంచు బాలునిన్
లాలనఁ జేయసాగె సుతలక్షణమా యనురాగ మూనుచున్॥

ఉ॥ ఎంత భయంబు నందితివొ యేడిచి యేడ్చియు నెంతసొక్కితో
పొంతల సంచరించు మృగపుంజముఁ గాంచియు నెట్లు నిల్చితో
హంతకు లేరు నిన్నిటు వనాంతర మందునఁ జేర్చి చంపఁగా
మంతన మొప్పకే విడచి మా కుపకారము జేసి రంచొగిన్॥

కం॥ సదయత బాలుని నక్కున
గదియించియు పైటఁదుడిచి కాళ్లుగడిగియున్
మొద లెర్రనినీళ్ళను వడి
ముదితలు దిగదుడచి పారఁబోసిన యంతన్ 30



గీ॥ దడుపుఁ జెందెనో యేమొ నా కొడుకటంచు
భూతిమంత్రించి నొసటను బొందుపఱచి
పీడఁ దొలగించి యాకలి తోఁడనుండె
నంచు లాలించు చింత యాహార మొసఁగి॥ 31

గీ॥ చంద్రబింబంబుఁ బురిడించు సన్ముఖంబు
హాససంయుతమౌచు విభాసమాన
మగుటఁ దలపోసియును చంద్రహాసుఁడంచు
నామకరణం బొనర్చి రెంతో ముదమున॥ 32

సీ॥ మన పార్థివుఁడు లబ్ధతనయుఁడై నాఁడట
చూచి వత్తము రారె సుదతులార!
ఆ కళావతి నేఁడు చేకొన్నదట సూనుఁ
గాంచి వత్తము రారె కాంతలార!
దైవదత్తంబైన తనయుఁ డబ్బెను గాన
పోయి వత్తము రారె పొలఁతులార!
వనసీమనుండిన గొని తెచ్చి నారంట
యరసి వత్తము రారె గరితలార!

చంద్రహాసవిలాసప్రశస్తుఁడంట
పరగఁ గనుగొంటకును రారె పడఁతులార
యనుచుఁ దమతమ సఖియుల కనుచురాజ
సౌధమున కేగుచుండిరి సతులు ప్రీతి 33

చం॥ పలుపురి కన్నులం బడిన బాలుని కెక్కడ దృష్టిదాకునో
పిలువక యేగుదెంచి రిటు వీరలటంచును బ్రేమతో సుతున్
దలచుచు నుండి రాప్తులు సదా తలిదండ్రుల రాగపున్ రసం
బెలమి పరిగ్రహించి సుతుఁ డింపెసలారె వినూతశోభలన్॥

గీ॥ ఈడుబాలురతో నాటలాడఁ బోయి
తడవు రాకున్న పరితాపమడర తల్లి
దండ్రు లింటింట వెదకింత్రు తనయు కొరకు
పుత్రమోహంబు లివిగదా పుడమి జూడ॥ 35

ఉ॥ ఐదవయేఁడు వచ్చుటయు నాతఁడు నోజ్జలచెంతఁ జేరి య
ష్టాదశవిద్యలన్ గరచె చండధనుర్నిగమాదిసత్కళా
సాధనయందు దక్షతను సత్వరమే గడియించె ధర్మసం
వేదవరేణ్యుఁ డయ్యెను సవిగాహితవర్తన నేర్చె పిమ్మటన్॥

ఉ॥ తల్లియుదండ్రియున్ గని ముదంబు వహింపఁగఁ బ్రేమపాత్రుఁడై
యెల్లవిధంబులన్ బ్రియమునే యొనరింపుచు నుండె బాల్య ము
ష్టల్లన జారి యౌవనమహాప్రభ లొప్పఁదొడంగె మేనఁ గాం
త్యుల్లసితాననంబు జెలువారె తుషారకరాభిరామమై॥

సీ॥ అతివిశాలంబౌచు నలరారె వక్షంబు
కర్ణాయతంబులై కన్నులొప్పె
వ్రణకిణాంకంబులై బాహువు లొప్పారె
నూనూగుమీసముల్ తోనదోచె



జానులంబంబులై చనె కరయుగ్మంబు
కడగంటి చూపులు గాననయ్యె
వికసించి మించె నత్యకలంకత మనంబు
పరువుమర్యాదల తెఱ వెఱిఁగెఁ

దనరె పదియారువన్నె కాంచనము కాంతి
దేహ మవయవసౌష్టవస్థితులు వెలసెఁ
జెందెఁ దరహాస మాననసీమ కలరెఁ
బాల్యమును వీడినంత యౌవనధనంబు॥ 38

చ॥ అలరె వసంతమన్మథజయంతుల బోలిన సుందరంబు కాం
తలకు హృదంబుజంబునను దార్కొను శల్యము భాతినొప్పె చూ
డ్కులు జెలువారె యంగజుని క్రూరతరాస్త్రవితానమట్లు కో
ర్కులు తమయంత మించుచును రూఢివహింపఁగసాగె నెమ్మదిన్॥

గీ॥ నవనవవిలాసభాసురాననముతోడ
శౌర్యసాహసధైర్యముల్ సత్వమొందె
నరిగశవిలుంఠనోద్ధతిస్ఫురణ మెఱసి
శోభితావయవస్ఫూర్తి జూడనొప్పె॥

గీ॥ భూవిభుని మంత్రియగు దుష్టబుద్ధి రాజ
కార్యకరణప్రసక్తి నక్కడికి రాగ
నెదురుగా నేగి యాపులిందేశ్వరుండు
తోడుకొనివచ్చి పీఠమందునను నిల్పి॥ 41

గీ॥ దుర్మతంబుల కిక్క, బంధువిహితాళి
పాలి పెనుకాల్ల కుక్క, సత్పాలనమున
కొప్పుగల త్రోకచుక్క, మనోంబుజంబు
రాతిముక్కగదా మంత్రిరాయలకును॥

కం॥ కోపము తాపము లేకయె
యీపురి యావలకుఁ బంపు టెట్లాతండ్రో
పాపాత్ముఁడు గద బాలునిఁ
జూపోపునె యంచు నెంచుచున్ వినయమునన్॥ 43

కం॥ కుశలప్రశ్న మొనర్చియు
ప్రశస్తచరిత్ర! తామువచ్చుటచే సా
దృశరహితకృతార్థత మా
ద్వశమయ్యెఁగదయ్య మంత్రివర్యా! స్థైర్యా॥

చ॥ తమరిట వచ్చుటన్ కడుముదంబున ధన్యుఁడనైతి నేఁడు సౌ
ధమును బవిత్రమయ్యె ధనధాన్యసమృద్ధులు గల్గఁగంటి మ
త్సములిక నేరు మంత్రికులచంద్రమ! మత్తపమెల్లఁ బండె నం
చమితమృదూక్తులన్ సచివు నల్లన సన్నుతులన్ బొనర్చుచున్

కం॥ ఇటు లిష్టాగోష్ఠివిధి
నటనటఁగల రాజకీయహారిమృదూక్తిన్
పటుగతి మాట్లాడఁగఁ దా
నటుజేరన్ వచ్చె చంద్రహాసుం డంతన్॥ 46



కం॥ వచ్చిన వానిని గనుగొని
యచ్చెరువడి జూచుచుండు నాతని కనెనో
సచ్చరితా! మత్సూనుఁడు
వచ్చెను త్వద్దర్శనాభివాంఛితుఁ డగుచున్॥ 47

చం॥ అని మనవిన్ బొనర్చి తనయా! సచివాగ్రణి వీరు, వీరికిన్
వినతియొనర్పుమా యన నవేలతరానతులన్ బొనర్చు వా
నినిఁ గని యాతఁడెన్నడు జనించెను మీ కెటు సూనుఁడయ్యె నం
చని యడుగంగ పల్కె సచివాగ్రణి కాతఁడు కౌతుకంబునన్॥

గీ॥ నాఁడు శ్రీపురికేతెంచి నాథుదర్శ
నము నొనర్చియు ప్రభుని యానతిని మఱలి
మత్పురంబున కేతెంచు మార్గమునను
గల్గు వనమధ్యమున యందుఁ గంటివీని॥ 49

గీ॥ రక్తసిక్తంబునైన చరణమునందు
ప్రేలొకం డారవడి దెగి వెన్కముందు
జాడలేనట్టి యిబ్బాలు సాదరమున
నెత్తి పురిజేర్చి పెంచితి నింతదనుక॥ 50

సీ॥ ఈతిబాధావిహీనాతిసౌఖ్యస్ఫూర్తి
వరలఁజొచ్చిరి సుమ్ము పౌరవరులు
నెలమూఁడు వాన లెన్నికజేయ వర్షింప
సత్ఫలప్రదయయ్యె సస్యసమితి

ఆబాలగోపాల మానందతుందిల
హృదయాబ్జులై యుండ నెసఁగెఁ బురము
ఇంటింట గాదెల కెక్కువై రాసులై
తనరారె నంతయు ధాన్యచయము
బాలుఁ డిప్పురిఁ జేరిన కాలమాది
పుత్రమోహాభిమానముల్ పొదల పెంచు
చుంటి మీతఁడు తలిదండ్రికంటె మమ్ము
మహితభక్తిని గొలిచెడు మంత్రివర్య ॥ 51

కం॥ అని వినుపించిన నెమ్మది
ఘనశిల బడినట్టులై జగావెతఁ గొలుపన్
గననీయక వెనుజేసియు
ననుమోదము జూపి యిట్టులను సచివుండున్ ॥

ఉ॥ సంతసమయ్యె దేవుఁడె యొసంగెనటంచుఁ దలంతుఁ బ్రేమ న
త్యంతముదంబునన్ బెనుప నోసుడి బాలుని నంచుఁ బల్కె తా
మంతనమందు నెంచె ననుమానమి కేలను చోరు లల్లనా
డంతకుఁ జేర్పకే శిశువునందలి చిహ్నముఁ జూపి రెంతయున్ ॥

చం॥ తెలిపెను పాదమందున తుదిన్ గలవ్రేలు వినష్టమయ్యె నం
చెలమి పులిందుఁ డొర యదియే మృతచిహ్నముగాఁగఁ జూపి చా
రులు నను బొంకుఁబుచ్చి బహుధాన్యములన్ బహుమానమందిరీ
కలి నెటువంటిచిత్రముల గాంచఁగ నయ్యెఁ గదా ధరాస్థలిన్ ॥



చం॥ మనపనిదీరె రాజగు సుమా యను జోస్యులపల్కు శూన్యభా
జనమొనరించి నాఁడనని సంతసమందుచు నుంటిఁగాని న
మ్మనమున నెంచనైతి నిటు మారణమున్ బొనరింప రేమొ నే
బనిచిన చారులంచు భగవంతుని చర్య విచిత్రమౌఁ గదా ॥

ఉ॥ పంచతఁగాంచె బాలుఁడని భావమునందుఁ దలంచి యుంటి నే
నెంచఁగనైతి వీఁడిట్టుల వృద్ధినిఁగాంచి మదీయరాజ్యభా
గ్యాంచితలక్ష్మి తానగుచు హస్తనిపీడన మాచరింపఁగా
నెంచఁగ మించు నంచు నెటులీతని నియ్యెడ రూపుమాపుదున్ ॥

గీ॥ తానబల్మిగాని తనబల్మి గాదని
జనము లాడరొక్కొ చర్చసేయ
నిచట వీనిఁజంప నెంచంగ రచ్చయౌ
నేమిసేతు నింక నెటులనైతు ॥ 57

శా॥ ఈసామంతుని కన్నుగప్పుగతి యెట్లీబాలునిన్ ధర్మసం
వాసస్థానముఁ జేర్చుబెట్టు లొరు లివ్వార్తన్ వినన్ బోనటుల్
గా సల్పంగల నెట్లు మద్ధృదయశల్యం బెట్లు బాయున్ నిరా
యాసం బీకరణంబునన్ దగదు వెయ్యార్మార్లు యోచించినన్ ॥

ఉ॥ శ్రీపురరాజ్యలక్ష్మి కడుచేరువ నున్నది మత్కుమారు ధై
ర్యాపరకాంచనాద్రి సుజనావనదక్షు గుణాంబురాశినిన్
భూపతిగా వరించు నిఁకఁ బుట్టదు విఘ్నమటంచు నెంచి నే
నోపిక బట్టియుంటి నితఁడూడె నిఁ కేమని నెమ్మనంబునన్ ॥

కం॥ ఒకదాని సేనొనర్చిన
వికటంబుగఁ జేయుచుండె వికృతఁపు దయ్యా
బకటా! తలఁపఁ బ్రతిక్రియ
పటుమర్ఘట మెట్టియుక్తి బన్నఁగ ననువా॥ 60

చ॥ స్వయముగ వీఁడు జచ్చెనను జాడఁ గనుంగొనకున్న నెట్టుల
య్యయొ! యిఁక తాళఁగల్గుదు వ్యథాకులపావకదాహమయ్యె నే
నయమున మేలుసేయఁగ మనంబున నెంచిన యాప్తు పోల్కిన్
ప్రియములు బల్కి యిల్ వెడలు రీతిని మంత్రముబన్ని కూల్చెదన్॥

కం॥ అదిగాక మరొకగతి నా
మదికిన్ స్ఫురియింపఁ బోను; మంచిని విషమున్
మదికింపుఁ జేయ నగు; భీ
ప్రదమా క్షీరములు శత్రుపద్ధతి నొసఁగన్॥ 62

గీ॥ సామమున దీర్చుగతి కార్యసమితి నొందు
యుక్తిసాధింపఁ జాల మీయుర్వి యందుఁ
గాన మనవా రుపాయముఖంబు నందు
నిలుపరే గురుభావంబు దెలుపునటుల॥ 63

కం॥ ఈగతి నాలోచింపుచు
మూగవిధంబునను జెలఁగ భోజనకృతకా
లాగతచిహ్నాగ నొకపడిఁ
జేగంటలు మ్రోయుటయును సేవకులంతన్॥ 64



వ॥ ఓగిరము సిద్ధపఱచితి మని విన్నవించుటయు మంత్రిమణి
స్నానాదికృత్యంబులు నిర్వర్తించి. 65

గీ॥ షడ్రసోపేతమైన భోజన మొనర్చి
శయ్యపై మేనుఁజేర్చి విస్తారవేద
నాపరవశాత్ముఁడై యేమి తోఁచఁబోక
తలఁచె నాదుష్టబుద్ధి స్వాంతంబునందు॥ 66

ఉ॥ పెక్కులు చిక్కులొక్కమొగి పిక్కటిలన్ మతి తక్కకింతయున్
బొక్కక యుక్తిఁబన్ని పరిపూర్తి యొనర్చెడి వాఁడనంచు తేఁ
డక్కజమంద నుప్పగల యట్టిఁడ; నేఁడది యేమొ దీనికిన్
దిక్కొకయింతఁ దోపదు పదింబది యోచనఁజేసి చూచినన్॥

చం॥ అని మదినెంచి సంశయసమాకులమానసుఁడై చెలంగు నా
తనిహృదయాంబుజాతమున తక్షణమే స్ఫురియించె నొక్కయో
చన, యటులన్ బొనర్చునెడ చచ్చియె తీరును చంద్రహాసుఁడం
చును ప్రమదాతిరేకమున జొక్కపులిందుఁడు జేరవచ్చినన్॥

చం॥ తనుగన నచ్చొటన్ గదియఁ డా జనుదెంచు పులిందుగాంచి మిం
చినకపటానురాగగతచిహ్నము లొప్పఁగఁ జేరఁబిల్చి స
మ్మనమున నుబ్బుగల్గ గలమాటలఁబల్కియుఁ గొప్పఁజేసి యో
జనవర! త్వత్సమానగుణజాలవిభూషణు లుంద్రె ధారుణిన్॥

చం॥ సరసుఁడ వార్యసన్నుతవచఃకలితుండవు సాధుమూర్తి వా
దరపరిపూజితాతిథివదాన్యుఁడ వంచితదానధర్మవి
స్ఫురితకరాంబుజుండ వరిపుంజదరక్షణశౌర్యధైర్యభా
స్వరుఁడవు నిన్నుఁ బోలఁగల వార లెవారు వసుంధరాస్థలిన్॥

గీ॥ అని ముఖప్రీతివాక్యము లాడఁబొంగి
తెచ్చికోలున్నతులంచును తెలియలేక
నాపులిందుండు సచివుని కనియె నిట్లు
కల్లమెచ్చులలోఁబడుఁ గద జగంబు॥ 71

ఉ॥ ఎంతటివాఁడ మీవలన నిట్టినుతుల్ గొనఁ ద్వత్కృపాప్తి న
త్యంతము మించువాఁడ నిటులాడఁగ యోగ్యుఁడఁ గాననంగ మ
త్స్వాంతము సంతసించె విలసద్గుణ! తావకసత్ప్రవర్తనల్
కాంతము లౌట నంచు ననఁగాఁ దొడఁగెన్ సచివుండు బ్రీతిమైన్॥

చం॥ సకలకళాప్రశస్తవిలసద్గుణబాహుబలాత్తధైర్యవ
త్ప్రకటితశక్తియుక్తుఁడు గదా భవదీయసుతుండు వాని మా
మకనరపాలుకొల్వునను మన్ననలందెడు నట్లొనర్తు సౌ
ఖ్యకరబుధప్రవర్తకునిఁగా నొనరింతును సుమ్ము నమ్ముమా॥

చం॥ మరచితిఁ గొన్ని పత్రములు మామక గేహమునందు, వానిఁ దే
నొరులను బంపరాదు కడు యోగ్యునిఁ గాక; రహస్యకార్యముల్
పరులకు వెల్లడించుఁ బెరవారలఁ బంపిన, త్వత్కుమారు వే
గిర మనుపంగ నొప్పు ప్రభుకృత్యము నియ్యెడ నిర్వహింపఁగన్॥

గీ॥ రాజకీయంబులైన కార్యములపట్ల
ప్రాణవాయువుల్లను తృణప్రాయముగను
తలచి తనరాజభక్తి నంతయును జూపి
యశము గనఁ దగు సమయమ్మైనపుడు నరుఁడు॥ 75



కం॥ ఏలికకంటె ధరాస్థలి
నాలును సంతతియు మరియు నసువులు ధనధా
న్యాళియుఁ గాదందురు రా
జాలంబన మున్న స్వర్గ మరచేతదగున్॥ 76

ఉ॥ ఏనట కేగి వత్తునని యీవు వచించెద వేమొ జూడు మ
ల్లైన మదీయకార్యనిచయావళి దీరుట లెట్టు లింకనై
నే నొకరుండ నొంటరిగ నియ్యెడ నెట్లు వసింతుఁ గాన నీ
పూనిక మాని నీకొమరుఁ బుచ్చుట యోగ్యమటంచుఁ దోఁచెడిన్॥

కం॥ తిరుగక చెడుదురు పురుషులు
తిరిగినఁ జెడిపోదు రెందు స్త్రీలన వినమే?
వెరవేటికి తగుగతి మ
త్పురికంపుము సూను సేమములు జెలువారన్॥ 78

కం॥ మంతిరి యిటుబల్కిన సా
మంతధరాజానిహృదయమధ్యస్థితతీ
ష్ణాంతస్ఫురదీర్ష్యాలస
త్కుంతంబులు నాటినట్లు కొలుమసఁగియెన్॥ 79

మ॥ అరచేనుంచియుఁ బెంచుచుంటలును నిత్యంబున్ దృఢత్వ బాయకే
పరిరక్షించుటఁ బ్రాణతుల్యముగఁ బ్రావన్ గల్గుటల్ గాంచి యీ
దురితాత్ముం డిటు పల్కుటేలనొకొ విందుల్ మెక్కియున్ గేహమ్మున్
పరగన్ ద్రవ్విన ఖ్యాతి నెట్టులవు మ్రావున్ వచ్చు నీమర్త్యుఁడున్॥

చం॥ ఇతరుల కంటఁబడ్డయెడ నెక్కడసోకునో దృష్టియంచు నా
మతిఁ దలపోసి యేను మరి మత్సతి కన్నులలోనఁ బెట్టి పెం
చితి మిపుడిట్లు బంపనగు శ్రీపురిఁజేరఁగ మార్గయానసం
గతమగు కష్టమీతఁ డెటుగాంచి సహింపఁగ నేర్చు నక్కటా॥

చం॥ అనిశము ప్రేమతోడఁ బువ్వులందునఁ బెట్టియుఁ బెంచికొన్న నం
దను నెటు శ్రీపురంబునకు నాతరమా బనుపంగ చంద్రహా
సుని ముఖనీరజం బిపుడు జూడక మేము తరించు టెట్టు లీ
దినదినకల్పముల్ సతియు దీనత వాసి చరించు టెట్టులో॥

కం॥ ఈవడువున నాతఁడు చిం
తావశతఁ గడుఁ గృశించి దైన్యము మీరన్
భావమున ధైర్యమూనియుఁ
దావలికి నమాత్యముఖము తద్దయుఁ గనుచున్॥ 83

ఉ॥ బాలుఁడు పిన్నవాఁడు తలవాకిలిఁ దప్పక జూడఁ డన్యమే
జోలి యెఱుంగఁ డర్భకుఁడు సుమ్మిటు లేగఁ గలాఁడు ఘోరశా
ర్దూలముఖాదివన్యమృగధూర్వహసంకులమైన మార్గమే
లీలఁ జొరంగలాఁడు లవలీవరకుంజవృతాగసీమలన్॥

ఉ॥ ఏఁ జనివత్తుగా ముద్దలనిచ్చిన నంచన, నిందు నొంటినే
యోజను నిల్తునార కడు యోగ్యుఁడవే యటులైనఁ జూడు నే
నే జనలేన బాలుఁడువనిన్ దరియింపఁగ లేఁడె తోడుగా
తాఁ జనరాదె చిత్రముగ దా భవదీయవచఃక్రమంబిలన్॥



గీ॥ పీలు లేకున్న పోనిమ్ము వెఱపు లేదు
కాకికాలికిఁ గబురంపఁ గాళ్లతోడ
రాకతక్కున నీకున్న రాజభక్తి
బయలు పడె సంతసించి తిప్పటికి నిట్లు॥ 86

గీ॥ అనుచు నీర్ష్యాంతరితములైనట్టి వాక్య
తతిని మొగమెల్ల చిట్లించు స్థితిని దెలిసి
నెమ్మనంబున యందు చింతించె నిట్టు
లాపుళిందుఁడు సవ్యాకులాత్ముఁడగుచు॥ 87

గీ॥ పంపకుండిన మంత్రి యిప్పట్ల కుపితుఁ
డై ఘటించును చిక్కు లత్యంతకఠిన
చిత్తుఁ; డంపిన బాలునిఁ జెందుఁ గీడు
కఱ్ఱునాగటి మధ్య జిక్కంగ గల్గె॥ 88

కం॥ ఎట్టులైనఁ బంపకుండినఁ
గుటిలాత్ముఁడు కష్టతతుల గూర్చును గాన
భటులసహాయముతోన
చ్చోటునకు నాత్మజునిఁ బంపఁ జూచుటయె తగున్॥ 89

వ॥ అని తనమనోంబుజంబునం దలపోసి యమ్మంత్రివరుం
గాంచి నాతనయుని భవదాజ్ఞానుసారంబుగా శ్రీపురంబునకుఁ బంపె
దనని యానతి యొసంగెనంత. 90

## ఆశ్వాసాంతము.

చం॥ నిరుపమసద్గుణౌఘ సరణిస్స్మరణీయ, కవీంద్రగేయబం
ధురగుణభాసమాన అసమానదయారసభాసురాత్మ ని
ర్భరశరహారహీరనిభభవ్యయశఃకలనాకలాప సుం
దరతరరూప, భవ్యవసుధాసురవంశవిభూషితాశయా॥

## పంచచామరము.

భవానిశంకరాంఘ్రియుగ్మభావనప్రభావుకా
భవాభిరామగేహకల్పబద్ధ భక్తిభాసురా
అవార్యకీర్తికామినీహృదంబుజాతభాస్కరా
కవీశవంద్యమానదానకర్ణసద్యశోమయా॥.

ఇది శ్రీ శేషాచలాధీశ చరణసేవాసమాసాదిత కవితా
విచిత్ర దూపాటివంశ పయఃపారావారరాకా
సుధాకర శేషాచార్యపౌత్ర వేంకట
రంగాచార్య పుత్ర శేషాచార్య
కవిమిత్ర ప్రణీతంబైన
చంద్రహాసచరిత్రమున
ద్వితీయాశ్వాసము.




## తృతీయాశ్వాసము.



శ్రీరఘురామాంఘ్రియుగాం
భోరుహసేవానుకూల బుద్ధివిశేషా
వారాంరాశిగభీరా
ధీరా! రఘునాథరాయ ధీమణిగేయా॥

గీ॥ అవధరింపుము సామంతుఁ డాత్మజాతు
శ్రీపురంబునకును బంపఁ జిత్తమందుఁ
దలచి మంతిరియాజ్ఞ నొం దంగఁ బంపఁ
బల్కె సచివునిఁ గాంచి యు బ్బాలుఁ డపుడు॥

ఉ॥ శ్రీపురి కేగి రమ్మనుచుఁ జెప్పెను మజ్జనకుండు నాకుఁ దా
మేపని నిర్ణయించెదగొ యేమొ వచింపుఁడు పోయివత్తు నం
చా పసిబాలుఁ డాడ విను నట్టి జనంబుల చిత్తపద్మముల్
కోపతరంబుగాఁ జెలఁగెఁ గ్రూరుని మంతిరి పంపు నెంచుచున్॥

ఉ॥ బాలుని వీపుఁ దట్టుచు శు భంబగు నంచని మంత్రి బల్కుచున్
సీలును జేసియుండి పరి శీలనఁ జేయఁగ వీలుగాని ప
త్రాళినిగల్గు జాబొసఁగి యయ్య! మదీయకుమారుఁ గాంచి యీ
ప్రోలున నుంటి నంచుఁ గబు రున్ వచియించియు లేఖనీఁదగున్॥

ఉ॥ ఎంతటికష్టమబ్బిన స హింపుమఁ గాని మదీయలేఖ కా
సంతయు వెల్లడింపకు శు భావళిగల్గును పోయిరమ్ము మా
ర్గాంతరమందు నిల్వకు మ దాత్మజుఁ గాంచెడిదన్క నంచు నా
మంతిరి బల్కఁ జిత్తమని మాంతసమీపముఁ జేరి మ్రొక్కినన్॥

చం॥ ఎటు జనివత్తువో తనయ యే నినుఁ గ్రమ్మరగాంచుటెట్లొ దు
ర్ఘటవనసత్వసంకులము కాననెటుల్ దరియింతువో మనం
బటమట నందెడున్ హృదయ మాతురతన్ వహియించె పోక మా
నుట తగదెట్లొ జాగ్రత జ నున్ వహియింపఁగ నల్లవేళలన్॥

గీ॥ పోయిరమ్మని యశ్రువుల్ పొదలు కన్ను
దోయి గద్గదమగుచును తొట్రువడగ
నైన యెలుఁగున సెలవీయ నచొటువీడి
తండ్రిదరిఁ జేరి భక్తి వం దనముఁ జేసి॥





చం॥ అరగియు వత్తునయ్య తమ రాజ్ఞయొసంగిన నంచు నంగ సా
దరపరిరంభణంబున నె దన్ గదియించి కుమార పోయిర
మ్మరిగెడి పట్ల జాగ్రత శు భావళినిన్ వరియించు సౌఖ్యసు
స్థిరతఁ జెలంగు నంచును వ చించెఁ బుళిందుఁడు నిబ్బరంబుగన్॥

ఉ॥ సర్వవిధంబులన్ పృథుల సత్వముగల్గి సలక్ష్యలక్షణా
ఖర్వమునై ప్రభంజనని కారనిరంతరవేగగామి గాం
ధర్వముఁ దెచ్చి సాహిణి ము దంబున చెంతల నిల్పె నంత నా
పార్వణచంద్రబింబసము భవ్యముఖుండగు చంద్రహాసుఁడున్॥

సీ॥ నలిపెంపు పట్టుదు వ్వలువ చుంగులు వార
పరగ మూపున వల్లె వా టొనర్చి
స్ఫటికంపు కర్ణభూ షణగోచి బ్రచురించు
ఘనకిరీటంబు మౌ ళిని ధరించి
అనవద్య తేజోవి హారంబు నలరించి
మెరయుచుండెడి బాహు పుసులఁ దాల్చి
ఇరువైపులను వాడి బరగి దగద్ధగల్
చిందు ఖడ్గం బొందు చేతనూని
వెలుఁగు వేణుజ మౌక్తిక విసరహార
సంతతిని బెంపుమీర వ క్షమునఁ దాల్చి
తనదు చెలువంబు నిలువుట ద్దమునఁ జూచి
సొగసు దీపింపఁ బయనంపు జూపుగదుర॥

సీ॥ తనవవ్యహాసంబు నొనుకరించెడు నట్టి
 చలువజిలుంగు దు వ్వలువగట్టి
తనమోము కాంతుల కెనయనఁగాఁ జాలు
 చంద్రహాసము గేల చాలఁబూని
తనమేని తళతళల్ దనరిమించెడు భూష
 ణములు హారములు కం ఠమున నూని
తనయంగసుకుమార తను వెల్లడించెడు
 మిసిమిచెన్నెసఁగు కు ప్పసముఁ దాల్చి
గీ॥ తన సుకీర్తి విభాతతి నొనువుఁ పఱచు
 శారదాగీశకార్ద్రివే యేశహీర
 కాంతిజితపారశీకకం ఖాణమెక్కి
 చంద్రహాసుఁడు శ్రీపురి చక్కికేగ ॥ 11

సీ॥ చంద్రహాసములీల చంద్రహాసముచాల
 కరపార్శ్వమున మించి గ్రాలుచుండ
విబుధేశ్వరులలీల విబుధేశ్వరులు చాల
 నందంద గుమిగూడి యలరుచుండ
అనిమిషాక్షులలీల ననిమిషాక్షులు చాల
 నుపరివీథుల నిల్చి యొప్పుచుండ
తార్క్ష్యసన్మణిలీల తార్క్ష్యసన్మణి చాల
 జవసత్వములతోడఁ జాలియుండ



 సద్గుణాబులలీలఁబ్ర శస్తులైన
 సద్గుణంబులు చాల చ క్కఁటఁజెలంగ
 వరలెఁ బార్వణచంద్రబిం బంబుభాతి
 చంద్రహాసుండు పయనంబు సాగి యపుడు ॥ 12

చం॥ చనుచును మార్గమధ్యమునఁ జండతరాటవిఁ గాంచి దాన న
 త్యనుపమఘోరసత్వవిపు లార్భటులన్ వినుచున్ సమీపధా
 రుణిరుహముల్ లతాతతులు ప్రోజ్వలనాకువ్రులున్ నికుంజముల్
 గనుఁగొని సంతసింపుచు జ గాభ్రమునొందుచు నేగియంతటన్ ॥

గీ॥ వనిని దరియించి తలచె నె మ్మనమునందు
 నడవిఁ జొచ్చిన డాది నా హారనిద్ర
 లెందుఁ జాలక కృశియించి రెంతయేని
 పరిజనంబులు నిల్వఁగాఁ బంపుటొప్పు ॥

కం॥ శ్రీపురవర మిచ్చటికి స
 మీపము నందుండనోపు మిక్కిలి కృశులై
 యోపిక దక్కిరి పరిజన
 మీపట్టున విడియఁజేసి రేఁ జనివత్తున్ ॥ 15

గీ॥ అస్మదాగమనంబున కరయు ధిచట
 నుండ భటులకుఁ బల్కి యి నుండు పశ్చి
 మాంబుధిన్ గ్రుంకుటలు తన యాత్మనెంచి
 నిలచె నారాతి వాటితోఁ గలసియుపట ॥

గీ॥ గగననాటకమందునఁ - గంజమిత్రు
పాత్ర రానున్నదని తెల్ప - వచ్చినట్టి
సూత్రధారు విధంబునఁ - జూడనయ్యె
విమలమగు కాంతులకు నిక్క - వేగుఁజుక్క ॥ 17

మ॥ తరుణీచూచుకలిప్తచందనసుగం - ధంబుల్ కరమ్మూని భా
సురపంకేరుహషండకుట్మలములన్ - సొంపార వర్తించి యా
దర మొప్పారఁగ మించు దంపతులమ - ధ్యన్ జేరి హర్షించి మం
దరయానంబుల వాతపోతములు చెం - దన్ సాగె నిమ్మాగతిన్॥

ఉ॥ చామలతోఁ బెనంగి సుఖ - సంపదనందిన ప్రోడలార! యా
రామము నందుఁ జేరి నిదు - రన్ గనుగూర్కెడి పాంథులార! యు
ద్దామతఁ బూర్వపారఁపుశ - తంబు పఠించు కలార్థులార! బ
ల్గోమున నిద్ర లెండనుచుఁ - గొక్కురొ కోయని కూసె కోళ్లగిన్॥

చం॥ ఎలమి నిశాటు తేజమును - హీనముఁ జేసి తమంబడంచి త
మ్ములకుఁ బ్రమోదమిచ్చి రుచి - పుంజము లష్టదిగంతరంబులన్
జెలువలరారఁ జేసి కరు - ణించు నినోదయమౌ నటంచుఁ బ్రే
వల నినదచ్ఛలాప్తి ద్విజ - పాళి యొనర్చెను భావిసూచనల్ ॥

గీ॥ ప్రాగ్దిశాఘనభూషణ - ప్రాంశురుచియొ
కుక్షిసంస్థితభాస్కరు - గురు మహాంబొ
వ్యోమసురసాలపల్లవ - పుంజకళయొ
గాఁదగు ననంగ నొదయరా - గంబు వెలిగె॥ 21



గీ॥ పగలు కల్పింప నేర్పరి - పంకజాత
హితుఁడు మలినాళిరతుఁడు స - మ్మతుఁడు వీని
మొగము రాజావలంబనం - బుగను మేము
కాంతుమే? యని ముకుళించెఁ - గలువచాలు ॥ 22

చం॥ మొదటను వెన్నెలన్ దునిమి - పోవఁగ నున్న వెడంగు చీఁకటిన్
జెదరఁగఁ జేసి కల్వలను - చేడెలకాంతి దొరంగఁ ద్రోచి యొ
ప్పిదమగు పాటలచ్ఛవి న - వేలగతిన్ దిశలందు నిల్పియున్
పిదపఁ బయోరుహాప్తుఁడు జ - నించెను ప్రాగ్ధరణీధరంబునన్ ॥

సీ॥ కలకదేరిన నీటి - కాల్వల నన్నింటి
జాహ్నవీనిభ కాంతి - చయినొసంగ
క్రౌంచిపురాకుల - మంజులచ్ఛాయల
జక్కనిరీతిని - సంస్కరించెఁ
దల ప్రాల్చి జాలితోఁ - దాల్మివీడిన తమ్మి
పూచేడియల కెన్న - ముద్దులొసఁగ
గండుతుమ్మెదల వె - క్కసఁపు నిర్బంధంబుఁ
బోగొట్టి మిగుల స - మ్మోదమిచ్చె
విన్ను ముట్టితినంచు నా - శ్వేరమూని
తగు నిశాటుని కళల సాం - తము విదల్చి
నుదయ మందిన పిదప న - త్యుచ్ఛయముగ
ధరణి కేతెంచు భాస్కరు - కిరణరాజి ॥ 42

మ॥ ఇఁకముం దిట్టల త్వత్ప్రభావములు లో ఽ కేడ్యంబులౌ విద్విష
త్ప్రకరానేకమహాంధకారములు దూ ఽ రంబయ్యెడిన్ బద్మినీ
నికరంబుల్ కడుసంతసించునని పీ ఽ నిన్ సామ్యముం జేసినా
యకలంకప్రభ మీఱె పూర్వకుధర ఽ ప్రాంతంబునం దెంతయున్ ॥

గీ॥ కాల్యకృత్యంబు లెల్లను ఽ గడపి యంత
స్నానమాడి భుజించి య ఽ నంతరంబు
రమ్యకళ్యాణపల్యాణ ఽ రాజితాశ్వ
మెలమి సాహిణి గొనివచ్చి ఽ నిలుప నెక్కె॥ 28

చం॥ మరచితి నేమొ యంచును న ఽ మాత్యుఁడొసంగినజాబు జేబునం
దరసియు సేవకుం డొసఁగి ఽ నట్టి సభక్ష్యవిశేషముల్ మహా
దరమునఁ జేతఁ బుచ్చికొని ఽ తానొక సన్న యొనర్చినంత నా
హారి పవనాతివేగమున ఽ నచ్చొటు వీడి గమించె నెంతయున్ ॥

చం॥ చనిచని భాస్కరుండు కర ఽ జాలవిభావిశిఖాళి పాంథవే
దనమును గూర్చుచున్ గగన ఽ ధామముమధ్య వెలుంగ నాతపం
బునఁ గృశియించుచున్ జనుచు ఽ ముందుగనుంగొనె పుష్పవాటి శ్రీ
జనపదబాహ్యభూమి వెలు ఽ చన్ దనయానభరంబు రూపఱన్ ॥

కం॥ అందందుఁ గానఁబడు జన
బృందము పృచ్ఛించి దాని ఽ శ్రీపురియని యా
నందమున గ్రహించి వనా
నందము పొడగాంచి తాఁ జ ఽ నం గలవాఁడై ॥ 29



సీ॥ తియ్యమామిడి జేరి ఽ తిన్నని నుడుల చేఁ
బాంధులఁ గలచెడి ఽ పరభృతములు
ఇప్పపూఁ దేనియ ఽ నింపుమై సాపడి
మత్తున బాడెడి ఽ మధుకరములు
కానసంతట నల్ల ఽ గల్వతోరణములు
గట్టు జూపుల కురం ఽ గములగములు
చీఁకటిచొట్టుల ఽ చెంతవసించి పిం
చియము విప్పి నటించు ఽ శిఖికులంబు
ఫలమహీరుహములపయి ఽ బారుదీరి
పలుకుచుండెడి గండుచి ఽ లుకల చయంబు
హృదయమున కబ్బురము గూర్చి ఽ యొసఁగుచున్న
నవ్వనంబునఁ జొచ్చి య ఽ నంతరంబు॥ 30

సీ॥ శారికాకలకంఠ ఽ కీరస్థితశిఖాగ్ర
రాజితసురసాల ఽ భూజములును
మధుపానవిగతబం ఽ భరకులఝంకార
రంజితవల్లీని ఽ కుంజములును
పరిఫుల్లసూనసం ఽ బంధమందాగత
ప్రచలితదక్షిణ ఽ వాయువులును
రాజహంసక్రౌంచ ఽ రాజదంభోజనం
తానభూషితజలా ఽ ధారములును

గలయఁ గనుఁగొని సంతోష ౼ కలితుఁడగుచుఁ
దద్వనవిలాసమునకుఁ జి ౼ త్తంబు నందు
నలరి మార్గశ్రమాపన ౼ యాభిలాష
నందు నిలువంగఁ దనయాత్మ ౼ యందు నెంచి॥ 31

కం॥ తన దేహగ్లానికి వా
డిన పూదీవియ చెలువున ౼ డీవి దొలంగి చి
క్కిన మేను నూర్పులొప్పఁగఁ
గనలి ముఖంబునను చెమట ౼ గ్రమ్మఁగనంతన్॥ 32

చం॥ తురఁగముఁ బచ్చికల్ గలుగు ౼ త్రోవలలో విడియించి వారిజా
కరమునఁ దానమాడియును ౼ కమ్రనిభత్ఫలముల్ భుజించి త
త్పరిసరసల్లతాగృహము ౼ ధామమునాఁ జెలువారఁ జొచ్చి యం
దరయఁగనైన వేదిక శ్ర ౼ మాపనయార్థము బవ్వళింపఁగన్॥

గీ॥ ఆతపాయాసమున సృక్కి ౼ నందువలన
నిదుర యావేశమయ్యె వా ౼ నికి నొకింత
అవనిశయ్యాసుఖములు ని ౼ ద్రాతురునకు
నవసరం బెందు లేదు గ ౼ దా తలంప॥ 34

వ॥ అట్లు చంద్రహాసుం డత్యంతనిద్రావేశుండై సుఖనిద్రఁ
జెందు నవసరంబున 35



ఉ॥ మంత్రిరి దుష్టబుద్ధికి కు ౼ మారుఁ డొకండు సుమాంచితాంగి య
త్యంతసురూపవైభవ జి ౼ తాత్మజురాణి వినీలనీరదా
క్రాంతసువేణి మత్తగజ ౼ రాజసమాలసయాన పూర్ణిమా
కాంతమనోహరాననయు ౼ గల్గునొకర్తు కుమారి యొలయర్॥

ఉ॥ బాల్యమువీడి యౌవన వి ౼ భాపరిఫుల్లతరాంగవల్లియై
శాల్యవిశాలనేత్రయుగ ౼ లాలితయై మరుచేతనొప్పు నా
శల్యము భాతి నొప్పుచు ప్ర ౼ శస్తతరాంగవిభాసమానయై
నైల్యశిరోజయై విషయ ౼ నాఁ జను నాఖ్యవహించి ధారుణిన్॥

కం॥ చూపులు మదనునిములుకుల
నాపు శిరోజములు బాభ ౼ రౌఘంబులఁ దా
మాపును గళమో శంఖము
నాపును చంచలల తనువు ౼ నందలి కాంతుల్॥ 38

మ॥ కనుపట్టెన్ ప్రసవాస్త్రబాణముల పీ ౼ కన్ జూపు లజ్జాతప
త్రనితాంతస్థితి కన్నుదోయి చెలఁగెన్ ౼ తారామనోనాథపా
వనబింబాబన నాస్యమొప్పె సుమవ ౼ ద్వల్లీమతల్లిగతిన్
తను వొప్పారె మృణాళనాళగతి విం ౼ తన్ హాస్తముల్ భాసిలెన్॥

సీ॥ సహజతైక్ష్ణ్యంబులై ౼ చాంచల్యయుతములై
చూపులో యన నొప్పె ౼ చూపులంత
సౌందర్యకరములై ౼ సంతోషభరములై
సరములై జెలువారె ౼ కరములంత

కాంతివిధానమై – కళలవిధానమై
మంగళకరమయ్యె – నంగమంత
హాసప్రచారమై – భాసప్రసారమౌ
సదనమై యలరారె – వదనమంత
సూక్ష్మమై మరి సూక్ష్మోన్నతి – సూక్ష్మమగుచు
తథ్యముగఁ గాంచఁ దనరారె – మధ్యమంత
నాఁడు మోహినియైన న – న్నలిననేత్రు
సోయగము మాటికెంచఁగా – నాయెనంత ॥

సీ॥ అతిచంచలములు ని – సితతీక్ష్ణతరములై
మేపుమీరెను కాంత – చూపులంత
కాంతివంతంబై ల – తాంతపేశలమౌచుఁ
దేజరిల్లెను కన్య – దేహమంత
జానుదీర్ఘంబునై – సన్నీలకళనొప్పి
వెలసె నాకన్నియ – వేణియంత
జవజవలాడుచు – నివ్వులన్నంబౌచు
మరియొప్పె నాకన్య – మధ్యమంత
పూర్ణిమాసోము దెగడుచు – మోము దనరె
తూడులన హస్తయుగ్మంబు – జూడనొప్పె
కర్ణదీర్ఘత్వమున కన్నుఁ – గవ రహించె
యౌవనంబున మదనుని – యస్త్రమనఁగ ॥ 41



సీ॥ అరవిచ్చు దాడిమీ – విరి నెల్లిదంబాడి
కరమొప్పె కామిని – కావిమోవి
మల్లెపూవులగుత్తి – నుల్లసంబును సల్పి
వెలసె చందనగంధి – మొలకనవ్వు
నెలవంక వంకలు – తొలఁగించి నిద్దమై
తద్దనొప్పెను చెలి – ముద్దుమోము
అమృత మాధుర్యంబు – నవఘళింపఁగఁజాలి
యలరారె లోలాక్షి – పలుకుచాలు
జలజసంతతి నెంతయు – జడమొనర్చి
నెలత కరపాదతలములు – నివ్వటిల్లె
కొలిచి నట్టుల యవయవం – బులు జెలంగె
సృష్టివైచిత్రి వర్ణన – చేయగలమె ॥ 42

గీ॥ చిత్రకారుఁడు నేర్పు ప్ర – సిద్ధిచేయఁ
దలచి చిత్రించినట్టి చి – త్రంబనంగ
బ్రహ్మ తనసృష్టిసామర్థ్య – పటిమఁజూడ
సృష్టిఁజేసె ననంగ నా – చెలియ వెలయు ॥ 43

చం॥ తన చెలికత్తె గూడియు స – దా జనుదెంచెడి పోల్కి సమ్మదం
బున జరియింపఁగా నుబుసు – పోకకు గా నటునాఁడు గూడ త
ద్వనమున సంచరింపఁ దన – ధామము వీడియు మంత్రిపుత్రి నా
తనప్రసవాస్త్రుశస్త్రమన – దా జనుదెంచె విలాసవాసయై ॥

సీ॥ పాదస్వనద్ధేమ । వలయముల్ మునుముందు
మంజీరరవముతో । మాటలాడ
కడుసోగగల్గి నె । క్కుడు సోయగముగల
కనులు శ్రోత్రముల స । ఖ్యంబు సల్ప
గందంపు మైపూత । కరణి గుత్తపురైక
యంగక ప్రభకు ని । య్యంబు నంద
కాంతివంతంబైన । కర్ణభూషణరోచి
తారహారములతో । దారసింప
మలయమారుతపూరిత । కలితగంధ
బంధురంబుల కెదమోద । భరితయగుచు
తనదు నెచ్చెలిఁగూడి ము । దంబుగదుర
వనినిఁ జేరంగనై తగు । వాంఛ జెలఁగ ॥ 45

చం॥ సకికయిదండనూని తన । స్థానము వీడుటలాది త్రోవఁగో
ప్రకటితమై చెలంగెడి శు । భంకర చిహ్నములెల్లఁ గాంచి చి
త్తకమల మంచితస్థితి ము । దంబు వహింపఁగ మందయానయై
చెకచెకఁజేరవచ్చె వన । సీమకు తద్విభవంబుఁ గాంచఁగన్ ॥

గీ॥ కల్గు శుభసూచకములను । గాంచి సఖియ
బలుకు నెచ్చెలి నేఁడు ని । న్నలరఁజేయు
రాకుమారుఁడు గల వన । ప్రాంతమునను
నేఁడనంగను తలవంచె । నెలతయంత॥ 47



ఉ॥ కొమ్మరో పల్లవాగతము । కొమ్మలు గోరెడు శ్యామగోరెఁ జూ
సమ్మతి నెంతయున్ విటప । సంగతమున్ కలకంఠకంఠి నీ
నెమ్మది రాకుమారుని వ । ర్నిన్ జయింపఁగ నేఁడు గాంతుసౌ
ఖ్యమ్ముగ సట్టి సోయగము । గాంచఁగఁ గల్గుట చేత నెచ్చెలీ॥

కం॥ అని చెలికత్తియ పల్కిన
విని వననల్లాళి విన వె । విశ్రుతమంద్ర
స్వనమున పుంస్కోకిలకొ
మ్మను దరిసియు వెలసెఁ గనుమ । మదగజగమనా॥ 49

కం॥ అగునగు పుంస్కోకిలచె
న్నగుకొమ్మల నెపుడు గూడు । టది యర్హంబే
తెగువగను మీ మదాళులు
మగఁవా మధుపానవశత । మలసెడిగంటే॥ 50

సీ॥ వెలదిరో గాంచితే । విరియఁబారిన మల్లె
మొల్లతీవియల స । త్పుష్పచయము
కాంతరో గనుగొంటె । కాంతలతాళిసం
గతమామ వెలసెడి । కళికలగమి
చామరో గంటె ర । సాలశాఖాగ్రసం
లతారుణంబుల । తలిరుచాలు
సకియరో గంటె కో । రకితపుష్పితపల్ల
వితభూషితానేక । విధకుజనులు

లలనరో కనుఁగొంటివే । కలరవైక
శారికాకీరకలకంఠ । సమితి గాన
మధికసంతోషదాయక । మై చెలంగె
నేఁడు వనవాటి ప్రీతిమైఁ జూడఁజూడ ॥ 51

ఉ॥ అన్నులమిన్న కన్నులకు । నందము బొందుపడన్ దనర్చె ను
త్పన్నమహోన్నతోన్నతము । దంబుహృదంబుజముల్ దలిర్చఁగా
గ్రొన్ననలెన్న చెన్నొదవు । కుందములొందెడి యందచందముల్
మొన్నఁగ నిన్నఁగ ప్రతతి । యింపుఘటించి వనిన్ జెలంగెడిన్ ॥

కం॥ అని యిటు వనసౌందర్యము
గనుఁగొనుచు విలాసవాక్య । కలితానందం
బినుమడి యగుటను చెలివిడి
జనుచుండె లతావిచిత్ర । సాలోకాప్తిన్. 53

ఉ॥ నెచ్చెలి వీడియున్ విషయ । నెమ్మదికిన్ బ్రమదంబుగూర్చుచున్
అచ్చెరువైన సూనసిచ । యాభిసుశోభితసల్లతానికుం
జోచ్చదశన్ గనుంగొనుచు । నొక్కకుడుంగమునందుఁగాంచె దా
బచ్చనివింటివాని పరు । వంబున నిద్దురజెందు యావనున్ ॥

చం॥ కనుఁగొని రిచ్చపాటొదవ । గావెనుముందుఁ జనంగలేక నూ
తనకుసుమాస్త్రుఁడో యనెదు । తత్పురుషోత్తము రెప్పవేయకే
గనుచును దత్తరంబొదవ । గాముఖనీరజమల్ల చెమ్మటల్
దనర నొకింత నిల్చియు న । దన్ దలపోయ దొడంగె నిట్టులన్ ॥



ఉ॥ చక్కనివాఁడు మేల్గులుకు । చాతురి గల్గినవాఁడు మోమునన్
జుక్కలఱేని నాపఁగల । సోయగముల్ గలవాఁడయారె య
మ్మక్క! యనంగనొప్పు కమ । లాంబకముల్ గలవాఁడు నిద్దురన్
జొక్కెడి నీనికుంజమునఁ । జూడఁగ మన్మథమోహనాంగుఁడై॥

గీ॥ అంటగందెడి మైదీగ । యట్టిగోట
గీటగా పాలుగారు చె । క్కిళులు చంద
మామ గోమును నోము ని । మ్మోముగలిగి
యాపరమన్మథుఁడో యన । నలరెనార ॥

సీ॥ పరిఫుల్లపంకేజ । పత్రంబులను గేరి
వెలయుచున్నవి । వీనికనులు
పూర్ణసుధాకరు । పొంకమ్ము హసియించి
వెలయుచున్నది । వీనిమోము
శ్రీకారములతీరు । చిందరనొనరించి
వెలయుచున్నవి । వీని చెవులు
ప్రతిసుమమకరంద । భాగ్యంబు గొనునట్టి
భృంగంబు లననొప్పు । వీనికురులు

గీ॥ కలువలకు మోదమిచ్చి పం । కజశతముల
బూని హసియించు చంద్రిక । వీనినగవు
నిఖలజీవనహాననని । ర్నిద్రసింహ
జానిఫక్కిని జెన్నారు । వీనినడుము॥

మ॥ వనసౌందర్యముఁ జూడఁగోరి తన భా వం బెల్ల సంతోషభా
జనమై యొప్పఁగ సంచరించి శ్రమమిం చన్ నిద్దురన్ జెందెనీ
ఘనసౌందర్యకరాంగుఁ డెవ్వఁడొకొ రా గా కారణం బేమొకో
ననునానందపయోధిముంచెఁగద సౌం దర్యాంగసౌభాగ్యముల్

చం॥ అలకలు నెమ్మొగంబున విహారముఁ జేసెడి నీరజంబునం
దలికులమట్లు శ్రోత్రముల నాస్తతఁ జేరిన యట్టులొప్పె క
న్నులు కుసుమాస్త్రధర్మములు నొక్కసుమీబొమదోయిబింబస
త్ఫలమగు మోవి యందముల తానజుఁ డెట్టుల సృష్టిఁ జేసెనో॥

సీ॥ మన్మథుఁ డగుసాటి మనుజసింహునికన్న
నతనుత్వ మొప్పియు వలదు నతఁడు
మధుఁడు తుల్యుండు కుమారునకనుకొన్న
కాలానుసారియై క్రాలు నతఁడు
విధుఁడు సామ్యుఁడు పరవీరునకనుకొన్న
పక్షపాతంబునఁ బ్రబలు నతఁడు
ఇంద్రజుండు సమానుఁ డితనికి ననుకొన్న
ననిమిషాక్షుండగు నట్టిఁ డతఁడు
దివ్యదేహాభిశోభితు నవ్యహాస
వికసితాననునాజాను విపులవక్షు
రాజలక్ష్మణలక్షితు నోజనేరు
పోల్చి వర్ణింపఁ గలవారు పుడమి యందు॥



కం॥ అని లక్షింపుచు నివ్విధ
మనమున నెంచుచును నిద్ర మైమరచిన తె
న్నును గని పరిసరమునకును
జనుదెంచి తలంప సాగె సంతోషమునన్॥

మ॥ పదియార్వన్నె పసిండిఁ గేరు తనుసం పన్నత్వ మయ్యారె శ్రీ
ప్రదమై షోడశసత్కళాకలితచం ద్రస్ఫూర్తి వారింపనౌ
వదనాభల్ జెలువారు నీని పతిగా భావింప నేకాంత భా
గ్యదశావల్లి ఫలించెనోయదియె ధన్యత్వంబుఁ గాంచున్ గదా॥

మం॥ అమృతస్యంది వచఃపరంపరలు నిత్యంబున్ వినన్ గల్గునే
భ్రమరాలోకకృతార్థ నిశ్చయము నే తద్భవ్యసోమాననున్
ప్రమదంబొప్పనహర్నిశంబులుగనన్ భాగ్యంబు నాబోటి జ
న్మము చెందన్ గలదే రమాధవుఁడు ప్రేమన్ గూర్చునే వీనితోన్॥

ఉ॥ అంతటి భాగ్యమబ్బిన వియత్పథమంటి చెలంగునట్టి యా
సంతసమందనే పొరుగు చామల నందఱ మించకుందునే
యంతటి కోర్కెఁ గోరుటది యందని ప్రానిఫలంబు లాసమై
దృంతు నటంచు హాస్తయుగి తోరపు వేడుక నెత్తినట్టులౌ॥

చం॥ హరియనుచిత్రకారుఁడు మహాద్భుతమౌ తన నేర్పుఁ జూప సుం
దరతను దీర్చిదీర్చి మరి త్రాసునఁ దూచి సృజింపఁబోలు నం
చరయఁగ నయ్యొ నీయువయవంబుల సౌష్ఠవ మిట్టిమూర్తి ను
ర్వర వినఁబోరు కన్గవన వారును గాంచరు నిశ్చయంబుగన్॥66

చం॥ అదనిది యంచు నెంచి కుసుమాస్త్రుఁడు సానను బెట్టి నూరి తా
పొది నమరించి యుంచినయమోఘశితాస్త్రములొక్కపెట్టునన్
మదవతి చిత్తవీధిని సమంబుగఁ దాఁగురిపెట్టి యేసె న
మ్మది విజయాభిలాషనటు మాటున జేరియు పొంచిమించుచున్

గీ॥ పరవశస్వాంతయై వాని భవ్యదేహ
సౌకుమార్యత గనఁగ నా ద్ఛాదనంబు
జేసె కవచంబు గానిచో చెన్నుఁగన్ను
లార గనకుందునే యంచు దేఁచూచి॥ 68

గీ॥ కోర్కెదీరంగ నెవ్వరీ కోమలాంగు
విపులవక్షఃప్రదేశంబు పేర్మిమీర
నిలుచు నాకాంత ధన్య యా లలనవైన
భాగ్యమే భాగ్యమగును త పంబు తపము॥ 69

చం॥ అని యటులెంచుచున్ హృదయమందలి కోర్కెలెల్ల మీరి తా
మనము నతిక్రమించె నన మాటికి మాటికిఁగో మహార్ఘణం
బను మిష నొప్పుచుండగను నాతని జేబుననుండి జారె పై
ననువగు శీలుగల్గి జెలు వారెడి లేఖయొకండు ప్రేల్మిడిన్॥ 70

కం॥ జారిన లేఖను గనుఁగొనుఁ
గోరిక లీరికలు సాగ గొబ్బున దానిన్
జేరి పఠించెను సోదరు
పేరన్ జాబునట జాల విస్మయ మగుటన్॥ 71



కం॥ నాలుగు మూలల జనకుని
శీలున్ జెలువారుచుంటఁ జింతించెను కా
బోలును మజ్జనకుఁడీ
బాలునిమాయన్న కడకుఁ బంపియె యుండున్॥ 72

చం॥ జనకుఁడు జాబు నీతనికొసంగియు నన్నకుఁ బంపఁబోలు మొ
న్నననె గదయేగె నిల్వెడలు నాధుని పంపున నింతలోన నీ
తని నిటుబంపుటేలనొ గతంబది యేమొ పరోపకారి మ
జ్జనకుఁడు వీనిపట్ల దలచంగనుబోఁడు గదా యెదేనియున్॥ 73

కం॥ అగుఁగాక లేఖ నంపఁగఁ
దగుకారణ మేమొ విప్పి దనుగా కనుచున్
తగునిది తగదిది యని యెం
చగ బోకు లతాంగు లెందు సాహసులు గదా॥ 74

చం॥ మరల యథాప్రకారమను మానము లేకయొసంగనైన యా
తెరఁగున సీలు జాగ్రతఁగ దీసియు నందలి జాబు విప్పి దా
నరయదొడంగి నంతహృదయాబ్జము వ్యాకులమయ్యెనంగముల్
కరము వడంక జొచ్చెనుజ గాత్రమగ్గలెను చూడఁ జూడఁగన్॥

కం॥ ఆమూలాగ్రము లేఖను
వేమరుదిలకించి దాన విశ్రుతమగు నా
భీమవ్యాహారంబుల
యామగువపఠించె నిట్టు లాత్మగతముగన్॥

చం॥ విషము నొసంగు మీతనికి వేగమె వేరుదలంపఁబోకు సా
హస మనియెంచఁబోకుము శు భావళిగల్గును దీనఁ దండ్రిలే
డసదృశ కార్యమియ్యది య టంచు దలంపక పితృవాక్య మీ
దెస కడునేర్పుఁజూపు మది తృప్తిని గూర్చును జూ కుమారకా॥

గీ॥ సాధ్యమైనంత శీఘ్రమే జఱిపియట్టి
వార్త నాకంపి సంతోష వార్ధి నోల
లాడ నొనరింపు మిది కాదు కూడదంచు
మానకెట్లైన నొనరింపు మాకుమార॥ 78

చం॥ అని పఠియించి యెంచె నిటు లౌరవిషంబు నొసంగు నీనికం
చని లిఖియింప చేతులెటు లాడెనొ యీ నవమోహనాంగునిక
గనుఁగొను నెల్లవారలకు గల్గెడుఁ బ్రేమము దుష్టబుద్ధి నాఁ
జను తనయాఖ్య సార్థకము సల్పఁగఁబోలును దండ్రిక్రూరుఁడై॥

ఉ॥ ఈకమనీయమూర్తి మన మెల్లహరించె నుపేక్షఁజేయనీ
లేకను గాంచి భ్రాత యవ లీలగ పితృహృదీప్సితంబునన్
జేకొని చేయఁడే యెటుల జేయఁగఁ దోపదు వీనిఁగాచుటా
హా! కడు చిత్రమిద్ది హృద యంబ పరాకు వహింపఁ బోకుమా॥

చం॥ పరపురుషప్రశంస విన భావము గోల్పని నాకు నీవనాం
తరమున సుందరాంగుఁడిటు గన్పడు టేలను గన్పడంగనే
సరసకుఁజేరి చిత్తజల జంబున మెచ్చియుఁ గోరుటేల నా
దరతను లేఖగాంచియు ము దంబు నశింపఁ గృశించు టేలనో॥



ఉ॥ సంతస మొక్కకంటను వి చారము వేరొకకంట నారహా
కాంతుఁడు గూర్చుఁ జిత్రము జ గంబున ధీరులు సంతసంబునఁ
దెంతయుఁ బొంగఁబోరు కృశి యింపరు దుఃఖముపట్ల ధైర్య మ
త్యంతము బూనుచుందురు గ దా ధరణీతలమందు నెల్లెడన్॥

గీ॥ గాన ధైర్యంబుఁ దొలఁగి ప్రస క్తమగు నేల
నేయుపాయాంతరముఁ బన్ని యేని వీని
ప్రాణరక్షణ మొనరించి ప్రాణనాథు
గాక బడయుట దగు నేర్పు కలిమి బలిమి॥

చం॥ అలసి సుఖాప్తి సుప్తుఁడయి నట్టికతంబున వీని లేపఁగా
గొలుపదు చిత్తపద్మ మను గుర్ జెలి నర్గనవచ్చు నేమొ నె
చ్చెలి గనరాదు వీనినని చిత్తము నందు దలంచి యాపదల్
దొలఁగు నుపాయ మేదియని తొట్రుపడంగఁ దొడంగ చేడియర్॥

కం॥ ఇటు లాలోచింపుచు ను
త్కట వేదనఁ గనుచు జాబు గనుగొను నంతన్
తటుకున యుక్తి స్ఫురించిన
నటు నిటుఁ దిలకించి పకసి తానన యగుచున్॥

గీ॥ విషము నొసఁగుము తప్పక వీనికనుచు
వ్రాసెగద జనకుండు మ ద్భ్రాతకిందు
విషయ నొసఁగుము తప్పక వీనికనుచు
దిద్దు దానను కోరికల్ దీరునటుల॥

ఉ॥ ఏనటు దిద్దితేని యిటు - లేటికి వ్రాసెనొ తండ్రియంచు సుం
తేనిఁ దలంపఁడేలనన - నిట్టులొనర్పుము సంతసించు మ
న్మానస మంచు నిందు నను - మానము లేక యొనర్చునట్టులన్
వూనిక వ్రాసియుంటజరు - పున్ దలఁపూను సహోదరుండొగిన్

చం॥ అరమరయేల నింకతృణ - మాగఁగ రాదు కృపన్ దలంచి యీ
నరునకు సాయమున్ సలిపి - నన్ సుకృతంబగుఁగాన వే హిత
స్ఫురణ రచించి లేఖనిట - పూర్వపురీతిని నుంచి పైని నే
నరిగెద నెచ్చెలిన్ గనఁగ - నయ్యెఁగదా తడవిందు నిల్చుటన్॥

చం॥ అతిసుకుమారుఁడీతఁడిటు - లాపదనొందక యుంట గాక నా
మతి దలపోసి నట్టులను - మంగళమబ్బ నటంచు నెంచి గు
ర్గతి గనకుండ నిప్పటికి - గావఁగఁగల్గితి ధన్యనైతి నం
చతికుతుకాంతరంగ యయి - యవ్విధిజేయఁగఁ బూనియుంతటన్

వ॥ కమ్మవిప్పి దానన్ గలుగు విషమనువాక్యంబు విషయగా నేత్ర కమలంబులం దలరారు కజ్జలంబునన్ దిద్దిగ్రహింప వీలుగాకుండు నట్లుండుటకు నాత్మగతంబునం దలరి యథాప్రకారంబుగా నను మానింప నలవిగా నట్లమరించి త్రద్రాజకుమారు హృదయ పీఠి మంచి.

మ॥ చనఁగా నెంచియు మీనకేతనఘను - జ్యాయుక్తనారాచ బా
లనితాంతవ్యథచే గృశించుచు గుణా - లంకారుఁడా వీని ద
ర్శన మెప్డబ్బును దింకపైనని విచా - రక్లిన్న చేతస్కయై
చనఁగాఁ జాలక నిల్వనేరక మనో - జవ్యగ్రదైన్యంబునన్॥



సీ॥ కనులర విప్పి మొ - గంబు చెల్వొప్పించి
చిత్తంబునందున - సిగ్గునందు
నిట్టూర్పులను బల్మి - నిగిడించి పాపిష్టి
దైవమా యనుచు మో - దంబుడిందు
బొటనవ్రేల్ నేలపై - మోటించి వ్రాయుచు
ధ్యాననైశ్చల్యంబు - నూనసాగు
నెద్దియో చెప్ప న - ట్లెంచుక యోజించి
తనలోన తామెచ్చి - కొనగడంగు
కెరలినాసాగ్రదృష్టినిఁ - గీలుకొల్పి
జారుపయ్యంట నెఱుఁగక - జాలినందు
కాలగతి మారునట్టుల - గ్గరిత తీరు
మారె సకలంబును నిమేష - మాత్రమునను॥ 92

గీ॥ జంటగానుండి మెలఁగియు - సంజకావి
గలుగఁబాసిన పెంటిజ - క్కవ విధాన
నినుని వీడిన పద్మినీ - వనితమాడ్కి
రాకుమారుని విడిచి యా - రామజనుచు॥ 93

కం॥ తనుఁగన వెదకుచు నెదురుగఁ
జనుదెంచెడి చెలినిఁ జేగ - సఖియా తడవ
య్యెను గద నన్విడిచియు నెం
దునుంటివి యింతదనుక - తోయరుహాక్షీ॥ 94

చం॥ మదనుని సైన్యముల్ మరియు మాధవుఁడున్ జెలువారుచుందురీ
పదమున నొంటిగా దిరుగ వచ్చునటమ్మరొ కన్య; లొంటివై
పదమిడ వీవు నీదుముఖ పద్మము చెప్పక చెప్పుచున్నదో
మదవతి పల్లవాప్తి నను మానము వీడి వచింపు మంచనన్॥ 95

గీ॥ సిగ్గుచే దలవంచి నెచ్చెలినిఁ గాంచి
చాలుచాలింపుమీ యెగ తాళి నింక
ననుచు చెలితోడ గూడి య వ్వనినివీడి
జేరె నిలయము వ్యాకుల చిత్తయగుచు॥ 96

చం॥ పగలొనరించి పద్మినులఁ బట్టితి మేటివికాసమిచ్చి పై
నగ దొనరించితిన్ గువల యాళికి సత్కళమాపినాఁడ మి
త్రుగతిని నాదు గుట్టుచెష రూఢిగ రాజరుఁదెంచనుండె నన్
దిగులున కస్మరంగె నన నీరజమిత్రుఁడు గ్రుంకె నంబుధిన్॥ 97

చం॥ త్వరపడి కార్యముల్ సలిపి తత్సమయోచితమా నలంక్రియా
స్ఫురణ లొనర్చి త్రోవలను జూచుచు నాయకులాక గోరు పం
కరుహదళాయతాక్షులు ని గారవుఁ గోరిక నిల్లుఁజేరు ధీ
వరులును ముద్దుబిడ్డల య వారితమోదము లత్తరిన్ దగన్॥ 98

చం॥ కలువలరేఁడు వెన్నెలల గాయఁగ నేర్చిన మేటివాఁడు త
మ్ములకును సూడు చోరవిట పుంజపుఁ గోకుమొఱుంగుబోండ్లమో
ములకును నీడు జాబిలియ మూల్యప యోధితరంగజాలని
స్తులతరశుభ్రరోచులు గ దుర్కొన వెల్గెను తూర్పు దిక్కునన్॥



సీ॥ దినమెల్ల గాఢని ద్రను విరించునట్టి గ
ల్వలకు సౌందర్యంబెల్ల వాపెఁ గొన్ని
సంఫుల్లలీలభా స్వరగతి మించు త
మ్ములకాంతులెల్లను బొందెగొన్ని
మిన్కుమిన్కనుచును మెరయు జుక్కల యర
మాపు జాయల నెల్ల మాపెఁగొన్ని
జారచోరులకును త్సాహభంజకముగా
గడలేని కాంతిచే గ్రాలెఁ గొన్ని
ఘనజకోరంపు టి ల్లాంద్ర గారవమున
కేలికలై రుచి నెసఁగె గొన్ని
విన్న నెడి పీఠి తొగలరా విందు పాల
నంబుసలిపెడి తఱికిర ణముల రాణి॥ 100

చం॥ జలజఁపుటిండ్ల తుమ్మెదలు జాయలతో సుఖనిద్ర జెందఁ గ
ల్వల చెలికాఁడు సత్పథము బాలనఁ సల్పఁగ గద్దె నందది
క్కుల గల గండుచీకటులు గొంచెము లేకయె నాశమొందవె
న్నెలపులుఁగుల్ యథేచ్ఛగ వనిన్ జరియింపఁగ సాగె నత్తరిన్

చం॥ అలమిన బత్తితోడఁ బవ లంతయు భూరుహకోటరంబులన్
నిలిచి తపంబుసల్పి హవ ణింపఁగ వేల్పులఁ బూజసల్పఁబూ
వులఁ గొనిరాఁగఁ బోఁదొడఁగు పోలికగుంపులుగూడి కౌశికా
వళి చరియింప సాగెనుజ వంబున నవ్వనరాజ మందునన్॥

గీ॥ పతివియోగంబు చేతను బడలుపట్టి
చెలులకన్నుల గ్రమ్మిన స్రులవితమున
చంద్రకిరణప్రసారంబు జరుగ నైంద
వాశ్మముల నీటి బిందువు లలముకొనియె॥

కం॥ తనయునిపరిపాలనకుఁ
మనమునసంతోషమంది మహనీయతరం
గనిచయహస్తయుగిఁ జా
చినగతి వారాశి యొప్పె శింజల్లీలఁ॥

ఉ॥ అంతట చంద్రహాసుఁడు ద్వి జామలసత్కరరాజితాప్తి న
త్యంత సుఖప్రసుప్తి విడి యల్లన వేదికడిగ్గునంతనే
చెంతలఁ బడ్డ జాబుఁగని చెచ్చెర చేకొని యుఁబ్రమాదమే
నెంత యజాగ్రతన్ నిదుర నిర్యోడఁ జెందితి నంచు నెంచుచున్

ఆశ్వాసాంతము

వం॥ సహమలమాదిరాజకుల సాగరచంద్ర! భవానినాథస
త్పదయుగలగ్నభావ! రస భావుకసత్కవితారహాస్యసం
పదతులదత్తమానస! అ పారకృపారసభావనా సమా
స్పదకరణీయ! సూరిజన వందితధర్మకళాధురంధరా॥



భుజంగప్రయాతము

స్మరారాతి పాదాబ్జ సంలగ్న భావా
పరంధామ సేవాను భావస్వభావా
దురంతారి సంతాన దుర్వార శీలా
పరాస్త్రాఘ సంఘాత పర్యాప్తకాలా॥

ఇది శ్రీ శేషాచలాధీశ చరణసేవాసమాసాదిత కవితా
విచిత్ర దూపాటి వంశపయఃపారావార సుధా
కర శేషాచార్యపౌత్ర వేంకటరంగాచార్య
పుత్ర శేషాచార్యకవి మిత్ర ప్రణీతం
బైన చంద్రహాస చరిత్రంబున
తృతీయాశ్వాసము సంపూర్ణము.





# చంద్రహాస చరిత్ర.

## చతుర్థాశ్వాసము.



శ్రీరామాసత్కరుణా
సారదృగంచలమరీచి - సంజాతసుఖా
ధారవిభవాధిగతసం
సారా! రఘునాథరాయ - సారాచారా॥

తే॥గీ॥ అవధరింపుము తద్వసా - భ్యంతరంబు
విడచి కంఖాణమెక్కి గం - భీరహృదయుఁ
డనఘుఁడగు చంద్రహాసుండు - చనఁదొడంగె
శ్రీపురాభిముఖుండయి - చిత్తమలర॥



చం॥ కనులకు ముందఁగన్పడియెఁ - గ్రమరసాలమనోజ్ఞవాటికా
జనితకిసాలభక్షణాల - సన్నవపంచమనాదగీతికా
జనితవనప్రియామృదువ - చఃకలితంబగు కేళికావనం
బును పయిగానవచ్చె సుఖ - భూమము శ్రీనగరీలలామముర్॥

చం॥ కనుగొని మంత్రిసత్తముఁడు - కమ్మను ఒంపిన దీపురంబుఁజే
ర్పనె గదయంచు మార్గపుభ - రంబునుహర్మ్యవిలాసభావముల్
గనుచుఁ దొలంగఁ ద్రోయుచును - గన్గొనె సౌధసుధాభిరామభా
జనజనపాలసేవ్యమయి - జానగు మంత్రిగృహప్రదేశముర్॥

కం॥ అంతట గృహమునకుం జని
మంతిరి సుతుఁగాంచి యో కుమా - రక విభవా
క్రాంతుఁడగు నీమజనకుఁ డు
దంతము నాచేత బంపె - నరయు మటంచుర్॥

చం॥ అని తనకుప్పసంబునఁ గ - లట్టి యొకానొక కమ్మఁదీసి యా
యనఘుని చేతికిచ్చి విష - యంబు గ్రహింపుమ వేగనాజ్ఞనా
కొనరగఁ నిమ్మయంచు మృదు - లోక్తులతోవచియించె మంత్రినం
దనుఁడుమనోంబుజాతమునఁ - దాఁబ్రముదాతిశయంబుగాంచుచుర్

ఉ॥ నవ్వుమొగంబుతోడ సుజ - నస్తవనీయుని జంద్రహాసునిర్
బువ్వులబూజజేసి రస - పుంజమృదూక్తుల నాదరించి నీ
వెవ్వరివాఁడవో యభిద - యెయ్యదియో యని ప్రశ్నజేసి వా
క్రువ్వ ముదంబుఁ గాంచి తన - కుర్ బితవ్రాసిన లేఖగాంచుచుర్॥

గీ॥ చంద్రహాసుని యానన చంద్రుఁగాంచి
యార్యమీరాక మాదుభా గ్యంపు ఫలము
ప్రాజ్ఞపాదరజం బది పడకయున్న
భవనమువనమ్ముకాదొకో భవ్యచరిత॥

ఉ॥ ఆదరమొప్ప నివ్విధి ర సాకరవాక్కుల గారవించి యా
గాదిలి మంత్రినందనుఁడు గమ్మను పల్మరు చూచిచూచి స
మ్మోదముతోడ నాగతుని పూజ్యచరిత్రుని చంద్రహాసుఁబా
ద్యాదిక మిచ్చి ప్రేమఁజెలు వారఁగఁ జూచి వచించె నీవిధిన్॥

గీ॥ తావకాగమనంబు నా తల్లి చెంత
వినిచి యేతెంతు నీరాక విమలసౌఖ్య
భాగ్యభాజనమంచును బల్కి మంత్రి
తనయుఁ డంతటఁ దమితన జననిజేరి॥

కం॥ అమ్మా! జనకుఁడు లేఖను
సమ్మతితోఁ బంపె వినుము సంగతులను సే
మమ్మట మీకుశలాదులు
కమ్మను లిఖియింపుమనియెఁ గారుణ్యమునన్॥

చం॥ ఎలమిని జాబుఁదెచ్చిన య హీనుని గౌరవదృష్టిఁగాంచి నా
తలపుఁ బరిగ్రహించి గుణ ధాముని మత్తనుజాతనిచ్చి కో
ర్కెలు దనివారఁ బెండ్లియొన రింపుఁడియాశుభవర్తమానమున్
దెలుపుఁడు సంతసించెదను దీని నలంఘ్యముగా నొనర్పుఁడీ॥



చం॥ అనివచియించి నీదుతన యామణినిచ్చి వివాహమింక నా
ఘనునకు శీఘ్రమే జరుపఁ గా వలయున్ జనకాజ్ఞ మీఱఁగా
జనదన మాతయున్ మిగుల సమ్మదమంది యటుల్ బొనర్పుమం
చును వచియించెఁ దత్తనయ చూపులఁదాలిచెసిగ్గు మొల్కఁగన్॥

ఉ॥ అంతట మంత్రిపుత్రుఁడు గు ణాకరుఁడా మదనుండు వేగఁ గా
ర్తాంతికదిష్టమై తగు శు భావహలగ్నమునందు సోదరిన్
సంతతరూపవైభవల సత్తరరమ్యతరన్ కృశోదరిన్
కంతుని పూవుముల్కి యనఁ గాఁ దగునావిషయావధూమణిన్

కం॥ వివిధాలంకరణంబుల
మివులన్ భూషింప విషయ మించె మదనుచేఁ
బువుముల్కిరీతి నచ్చెలి
నవలావణ్యంబు దనిపె నయనయుగంబుల్॥

గీ॥ చంద్రహాసుని చెంతకు సచివసుతుఁడు
సమ్మదంబున జేరి ప్రే మమ్మునిగుడ
జనకునాన వచించి సౌ జన్యమొంచి
అనుఁగుఁ జెల్లెలిఁ బ్రేమ పెం డ్లాడుమనియె॥

సీ॥ పురమెల్ల మివుల న చ్చెరువుగా నెంతో వి
లాసవంతముగా న లంకరించి
విషయనుసౌభాగ్య విభవాభిరామను
కళ్యాణవేదిపైఁ గ్రాలఁజేసి

తూర్యనిస్వనముల / స్తోత్రంబుగా మించఁ
బరిణయచిహ్నముల్ / ప్రస్తరించి
చంద్రహాసుని రాజ / చంద్రసంస్తవనీయు
గనకవస్త్రమ్ములఁ / గట్టనిచ్చి

గీ॥ వివిధభూమీసురాశీఃప్ర / విస్తరముగ
మంగళము రూపవంతమై / మందిరమున
చెన్నుమీరంగ మదనుండు / చేసె ననుజ
పాణిపీడన మహదుత్స / వమ్ముఁ బేర్మి॥

కం॥ క్రమముగ వైవాహిక కా
ర్యములన్నియుఁ దీర్చి సుగుణ / రాజితవిషయా
ప్రముఖను స్యాలకుభూపా
రమణీయుల నల్పి సాను / రాగముఁ జూపెన్॥

చం॥ అనుజను చంద్రహాసు ముద / మారఁగ నామదనుండు వెంటఁదో
డ్కొని నృపహర్మ్యభాగమున / కున్ జనియాతఁడ చెల్లికిన్ మగం
డని వచియింప నానృపతి / యర్హుఁడు యోగ్యుఁడు నాకువంశమీ
తనివలనన్ ప్రశస్తకలి / తంబుగ మించు నటంచుఁ బల్కుచున్॥

ఉ॥ కూరిమి చంద్రహాసుపయిఁ / గూరిచి యాతని గారవించి స
త్కారము నర్పి మానసగ / తంబుగ నీతఁడు నాకునల్లుఁడై
మీరినచో మదన్వయస / మిద్ధమహత్తరకీర్తివ్యాప్తమై
కేరదె చంద్రకాంతులను / గేవలుఁడీతఁ డనంగ నొప్పునే॥



కం॥ అని తలపోసియు విషయా
వనితామణి చంద్రహాసు / వాల్లభ్యదయా
జనితాలోకనముల చేఁ
దనియించెను హృదయమందు / తాలిమిగదురన్॥

ఉ॥ పిమ్మటఁ బెండ్లివార్తఁ బృథి / వీసురుచేఁ దనతండ్రి చెంతకున్
సమ్మదమారఁ బంప నల / తమ్మసురమౌళియు శోణపట్టణం
బిమ్ముల జేరి దుష్టమతి / కీకథనంతయు విన్నవింపఁగా
నుమ్మలికమ్ము నందితన / కున్నది పోయినటుల్ తలంకుచున్

ఉ॥ పుత్రుఁడు దష్టచిత్తుఁడయి / భూరిగుణాకరభాసమానయౌ
పుత్రిని చంద్రహాసునకు / పూర్వముఁ డంబున నిచ్చి స్వీయ చా
రిత్రము వెల్లడించె నివ / రించెనె స్వీయదురుద్యమంబు నా
పత్రికఁ జూచి యిట్లు గలు / రన్ దనకేమి ఘటిల్లెనో కదా॥

చం॥ తునుముము వీసినంచును న / దోవిధి వ్రాయఁ దిరస్కరించి త
ననుజ నొసంగి పెండ్లితగు / నా యొనరింపఁగఁ బుత్రకుండు
నొనరుచు కార్యమెల్ల నిటు / లూరకఁ బోవుట చూడఁ జంద్రహా
సునకుఁ జిరాయువుండె నను / చున్ వగయించెడిదీయె గదా

ఉ॥ వ్రాసిన దొడ్డు నాతనయు / వర్తనయొండుగఁ దోచుచుండె నీ
దోసము చంద్రహాసునిదె / ధూర్తుఁడితండిటు వేషమార్చి యి
వేసము వేసియుండనగు / వీనిని యల్లుఁడటంచు నెంచి వి
శ్వాసము నింపరాదు వధ / సల్పక మానగ రాదు నాకికన్॥

సీ॥ తలను చెండుమటంచు తలవరులకొసంగ
పాపిచావక యెట్లొ బ్రదికినాఁడు
ఘోరకాననసీమ క్రూరమృగాళిచే
భక్షింపఁబడఁబోక బ్రతికినాఁడు
పృథులదుర్గమమైన శ్రీపురపథమున
మడియక మృతికి మూర్మసలినాఁడు
విషమునిమ్మనుచును విలిఖింప చావక
విషయను బెండ్లాడి వెలసినాఁడు
కటకటా! నాదుదుష్కృత్య కల్పనంబు
చంద్రహాసునిపట్ల సా జన్యకార
ణంబులుగ మించె నెట్లుచిం తామహాబ్ధి
నీదఁగలవాఁడ రిపువధి యించువాఁడ॥

గీ॥ అనుచు వ్యాకులవాతంబు లాశయమున
సారెసారెకు వీవగా సంచలించి
ఆత్మజాని దుండగమొ చంద్ర హాసు కృత్రి
మంబొ తెలియదుగాకని మదిఁదలంచి॥

ఉ॥ శోణపురంబు వీడి మది క్షోభవహింపఁగ దుష్టబుద్ధి పా
షాణశిలావిటంకవిల సత్పృథుకాననపంక్తిదాటి గీ
ర్వాణపురీవిలాసవిభ వంబులుగా దను శ్రీపురంబు హృ
త్కోణగతార్తి పెచ్చరిలఁ గొండొకనాళ్ళకుఁ జేరియచ్చటన్॥



కం॥ పరిణయచిహ్నకరమ్మై
సిరిపొలఁతికి నాటపట్టు చెలువునఁ దగుమా
దిరమును దరియఁగఁ జని మది
దరికొను క్రోధానలంబు తాపంబీనన్॥

చం॥ తనయునిఁ బిల్చి యిట్లు పరి తాపకరంబుగ సంచరించి నా
తనయను జాతిహీనునకు ధైర్యమెఱుఁగని వానికిచ్చి పెం
డ్లిని బొనరింప ధర్మమగు నేయను తండ్రికి మ్రొక్కి పుత్రుఁడి
ట్లని వచియించె నిర్మలయ థార్థవచోవిధి తాండవింపఁగన్॥

కం॥ మీయాజ్ఞను దీక్షితి నే
నీయెడస్వాతంత్ర్యబుద్ధి నెఱుఁగ ననుచుఁ గే
ల్దోయి ఘటియించి జనకుని
వ్రాయసమున్ జూపి యర్థ భంగినుడువఁగన్॥

ఉ॥ అంతట దుష్టబుద్ధి హృద యంబు దహింపఁగ లేఖఁజూచి వృ
త్తాంతమెఱింగి యిందు విష యన్ లిఖియించితి మత్సుతుండునా
స్వాంతమెఱుంగఁ డాయెనని సారెకు నైజదురుద్యమంబు చి
త్తాంతరమందె డాచి యతు లార్తిభరంబున నంతనొందుచున్॥

ఉ॥ ఎవ్విధిఁ జంద్రహాసు వధి యించెద నెవ్విధక్రోధమారు నా
నెవ్వగఁ బాయుటెట్టులని నెమ్మది వ్యాకులమందు నంత మేల్
జవ్వన మింపుగుల్కు తను జాతయు నల్లుఁడు మ్రొక్కరంత వా
క్రువ్వఁడు దీవనల్ తనదు క్రూరత చిత్తములోనఁదాచుచున్॥

గీ॥ సారెసారెకు నెమ్మది చంద్రహాసుఁ
జంపుయత్నంబులను జేయ సాగె నతఁడు
స్వాంతమున కొక్కయోజన సందడింప
నాత్మతాపంబు శమియించె నంచు నెంచి॥

ఉ॥ ప్రేమను చంద్రహాసు పిలి పించి మృదూక్తుల గారవించి మా
ధామము నీకతాన సుర ధామమె యయ్యె నటంచు మెచ్చి నీ
కామితసిద్ధి గల్గుటకు గా గృహదేవతయైన కాళికిన్
శ్రీమహితానవద్యశశి శేఖరు నింతికి సేవచేయనౌ॥

కం॥ ఖండపరశుగేహినికిన్
పెండిలి కొమరుండు బలిని బెట్టుట మాకున్
కొండొక యాచారము చా
ముండయు నద్దానఁ దృప్తిఁ బొందును సుమ్మా.

చం॥ ఇరులు దిగంతరాళముల నెల్లెడఁ గ్రమ్మెడివేళ మాంసమో
గిరము గ్రహించి కాళికిడి కేలు మొగిడ్చి వరంబులందనొం
టరిగ గమించు చుండుటలు నాకులధర్మము గాన నేఁటి రా
తిరి పయనమ్ము గమ్ముసుకృతి ప్రథగాంచుము కొమ్ము సౌఖ్యమున్॥

కం॥ అనిపలికి చంద్రహాసుని
యనువుగ నందులకు బయనమగుమని సర్వం
బును సమకూరిచి యొంటిగ
జను తెఱగున్ దెలిపి యతని సద్మము జేర్చెన్॥



ఉ॥ ఆవల దుష్టబుద్ధి హృద యావహశోకభయాతిరేక దు
ర్భావము సైపలేక యతిపాపుల నల్వుర బిల్వబంచి సం
భావనఁ జేసి కాళిగుడి పజ్జను వచ్చెడి వానితప్పకే
ప్రేవులు తీసి వేగఁ బలి పెట్టుఁడు దేవికిఁ దెండుచిహ్నముల్॥

ఉ॥ యుక్త మయుక్తమంచు మది నూహయొనర్పక యాతఁడెవ్వఁడీ
శక్తికి దాసుఁడంచు మది సంశయ మందక చెండి తద్గళ
రక్తము భూతతృప్తికయి ధారుణిపైఁ బ్రసరింపఁజేసి నా
సూక్తిని నిర్వహింపుఁడు బహూకృతులన్ బొనరింతు క్రమ్మఱన్

కం॥ అని రత్నభూషలును గాం
చన వస్తువులొసగి పంపఁ జని యవ్వారల్
సునిశితకరవాలములన్
గొని కాళికయాలయమున గూఢతనుండన్

గీ॥ మాతులుని యాజ్ఞ నెరవేర్ప మానసమునఁ
దలఁచి యాచంద్రహాసుఁడు దారమూర్తి
బలిపదార్థంబులను కేల బట్టి కాళి
కాలయము జేర జనసాగె నతులభక్తి॥

ఉ॥ ఆశల నంధకారరుచి యల్లుకొనంగఁ దొడంగ నొంటిగాఁ
బేశలగాత్రుఁడై తగు నభీరమనస్కుఁడు చంద్రహాసుఁడా
కాశదిశావకాశముల నారయుచున్ జనుచుండ మానస
క్లేశముగల్గె భావము చలింపఁగ సాగెను పెక్కురీతులన్॥

చం॥ ఇదియిటులుండ శ్రీపురమ ఽ హీపతియా విజయుండు దీర్ఘమా
గదము వ్యథావికారములు ఽ కల్గఁగ జేయఁగనొచ్చితత్ శ్రమా
స్పదుఁడయి బాధనొందుచును ఽ బంచతగాంచఁగ నుండి యంతలో
మదనుని గాంచి ప్రేమము స ఽ మంజసలీలఁ జెలంగ నిట్లనెన్॥

కం॥ మంత్రియయి నీజనకుఁడు స్వ
తంత్రమ్ముగ రాజ్యభార ఽ తత్పరుఁడై తా
తంత్రజ్ఞానవిదగ్ధా
మంత్రణమున మమ్ముఁ దనిపె మానస మలరన్॥

గీ॥ మొదటనుండి మంత్రి ఽ పదవి మీరుండుటఁ
బాలనంబు మాదు ఽ పజ్జనుంట
నాదినుండివచ్చు ఽ ననుచారమయ్యె మీ
సమ మనీష కెన్నొ ఽ స్వాగతములు॥

ఉ॥ ప్రాజ్యరమాభిరామమయి ఽ భాసిలుచుండిన మామకీనసా
రాజ్యము నింక మీఁదఁ బర ఽ రాజులకున్ వశమౌనొ యేమొసా
మ్రాజ్యము పుత్రశూన్యమగు ఽ మాకులమెట్లు భరించునింక స
త్పూజ్యున కీధరాభరము ఽ పూజ యొనర్చి యొసంగఁ గాఁదగున్॥

చం॥ కలదొక పుత్రినాకు కవి ఽ గౌరవనీయవయోవిలాసని
ర్మలతరరూపవైభవవి ఽ రాజితగాత్రి తదంగనాసము
జ్జ్వలతరసుందరంబునకు ఽ సాటికి వచ్చెడి రాజపుత్రునిన్
నిలిపెద రాజ్యమందుఁ బుఱు ఽ నిన్ దగనల్లునిగా నొనర్చెదన్॥



కం॥ సర్వవిధంబుల లక్ష్మీ
ధూర్వహుఁడగు వాఁడు లేఁడు ఽ దుస్తరమిది, నే
సర్వత్రగాంచితిని యొక
సర్వజ్ఞుఁడు కలఁడతండు ఽ సంభవ మగునే॥

కం॥ అని సంశయించు నాభూ
పుని మొగమునుజూచి మంత్రి ఽ పుత్రుఁడు మదిలోఁ
గొనలెత్తు మోదమున నా
తని పేరుం దెలుపుమని యు ఽ దారతఁ బలికెన్॥

చం॥ అనవుడు రేఁడు నెమ్మనము ఽ నందునమోదము తాండవింపఁగా
గనులు వికాసభావమునఁ ఽ గ్రాలఁగ నిట్లువచించెఁ జంద్రహా
సునకు మదీయపుత్రికను ఽ క్షోణిభరంబును నర్పితంబుగాఁ
బొనరుప నెంచినాఁడ హిత ఽ మున్ గలదేనియుఁ దెల్పఁగాఁదగున్

సీ॥ ఎలప్రాయమున యందు ఽ నెల్లవిద్యల నేర్చి
కమనీయతరకీర్తి ఽ గాంచినాఁడు
సద్గుణంబులయందు ఽ సౌజన్యములలోనఁ
బురుడు చూపఁగరాని ఽ పుణ్యమూర్తి
సామ్రాజ్యపాలనా ఽ చాకచక్యములఁగా
నాచియనందగు ఽ రాచబిడ్డ
శరకళాకౌశలి ఽ సాహిత్యగరిమంబు
నుగ్గుపోతగనోపు ఽ మరుయశుండు

గీ॥ శోణకటకరమాభార శోభితుండు
చంద్రహాసుండు కరగత చంద్రహాసుఁ
డాత్మజాతను బేర్మి మెం డ్లాడ రాజ్య
రమనుగేల్బట్ట నాకు యు క్తమని తోఁచె॥

చం॥ అనిశము నాదురాజ్యమున యాశ్రయమున్ బొనరించియున్ననీ
జనకుఁడు దీనివిన్న మది సంతస మందియు తీఱుఁ బుత్రుఁడ
న్నను మఱియల్లుఁడన్నను జ నంబులు వేఱుగ నెంచఁబోరు నా
తనయను నీదుసోదరిగఁ దత్పరతన్ దలపోయఁగాఁదగున్॥

కం॥ ధరణీశుఁడివ్విధమ్మున
సరసోక్తి నిధానమగు ప్ర సంగాంతమునన్
ద్వరితగతిఁ జంద్రహాసుని
యరుదేరఁగఁ జేయుమంచు నాజ్ఞయొసంగెన్॥

చం॥ మదనుఁడు సత్వరంబుగను మందిరమున్ దరియంగనేగి ధీ
సదనుని చంద్రహాసు గన జాలక యచ్చటి వాఁరిచేత న
క్కాఁడువ కథావిశేషమును గూడ శ్రుతిస్థలిఁజేర్చి కాళికా
సదనము జేరు నమ్మఱఁది సన్నిధికై పయనంబుఁ జేయుచున్॥

కం॥ విధ్వస్తధైర్యుఁడై గా
ఢధ్వాంతమునందుఁ జని త టాలున నమ్మ
ధ్యాధ్వమునఁ జంద్రహాసుని
సాధ్వర్చితుగాంచి మృదువ చఃశతి ననున్॥



గీ॥ మఱఁది! నిన్ను రాజు మాటాడిపొమ్మన
తడవుచేయ కింక తరలుమయ్య
రాజునానదాట రాదు రాష్ట్రీయులు
ప్రాణమేగుచున్న పట్లనేని॥

కం॥ ఈలోన నేను కాళికి
వైళమపూజావిధుల్ స పర్యసలిపి రా
జాలయమున కేతెంచెద
నాలస్యముచేయకీవు నరుగంగఁ దగున్॥

చం॥ అని మరదిన్ ధరావిభుని యంగణమున్ దరియంగ బంచి తా
గొనకొని కాళిపూజలకు గూడిన యర్హసువస్తుసంతతిన్
గొని హృదయంబు భక్తి రస గుంఫితమై తనవారముందు వె
న్కను గన మాని సత్వరమ కాళికగేహముఁ జేరె నత్తరిన్॥

ఉ॥ ఆలయసీమ జేరు సచి వాత్మజుపై బడి తండ్రిపంపుచేఁ
గాలము వేచియున్న బయ కారులు కత్తులడాలు మించఁగాఁ
గాలుభటప్రతానముల కైవడిఁ బైబడి ఖండఖండముల్
జీలిచి మేను సర్వమును జెండిగ్రహించిరి స్కంధభాగమున్॥

కం॥ ప్రెగ్గడ బిడ్డతలంగొని
దిగ్గనప్రభుకార్యభరము దీర్చితిమని లో
మొగ్గుగ మోదము నందుచు
కిగ్గాడి దురాత్ములు పురి కిన్ జనిరంతన్॥

గీ॥ చంద్రహాసుండు కాళికా సద్మమునకు
మదను బంపించి భూవిభు సదనమునకు
గటికచీకటిలోన నొ క్కరుఁడు వచ్చు
చుండె శుభసూచకములకు నుత్సహించి ॥

ఉ॥ వచ్చిన చంద్రహాసుని నృ పాలుఁడు గారవలీలఁగాంచి పైఁ
జెచ్చెర జేరఁజీరి తన చేత రహించెడి ముద్దుటుంగరం
బిచ్చి కవుంగలించి కొని యింతటినుండి మదీయరాజ్యసం
పచ్చతురుండవై చిరశు భంబులఁ గాంచుమటంచు నిట్లనున్ ॥

కం॥ చంపకమాల యనం ధీ
సంపన్నిరవద్య యాత్మ జాతకలదు నీ
వింపుగ నాయమనుం బ్రే
మింపుచుఁ బరిణయముగనుమి మెచ్చ జనంబుల్ ॥

చం॥ ఇటుల వచించి రేఁడు కృత కృత్యుఁడనైతిని నాదు జన్మమిం
తటనె కృతార్థభావమును దాలిచె నాత్మజకర్హుఁడైన యు
త్కటగుణభాసురాత్మకుఁడు ధన్యుఁడు భర్తలభించె రాజ్యమ
న్నిటను సమర్థుఁడైన నృపు నిఁక బతిఁగాఁగాన సంతసించితిన్ ॥

కం॥ అని వచియింపఁగ వేల్పులు
ఘనతరసమ్మోదభావ కల్పన మెదలో
గొనలెత్త పుష్పవర్షం
బునుగురిసిరి మలయవాయు వులు వీచె నిలన్ ॥



వ॥ అంత సిద్ధాంతిముఖ్యనిర్దిష్టంబగు నాశుభముహూర్తమున సే
విజయభూమీశ్వరుండు నిజబంధుహితామాత్య సామంతపరిజనంబు
లకు నేఁటిరాత్రికి నాత్మసామ్రాజ్యంబు చంద్రహాసునకుఁ బట్టంబు
గట్టెదమనియు నెల్లిచంపకమాలి నొసంగి శుభవివాహంబు గావింతు
మనియు శుభపత్రికల వ్రాయించి సర్వస్థలంబులకుఁ బంపిన

కం॥ మంగళనాదమ్ములు దిశ
లంగూలంకషముగాఁ జె లంగఁగ ధాత్రీ
శాంగణము సర్వవిధముల
మంగళనిలయమ్ముగా స మంజసమయ్యెన్ ॥

సీ॥ క్ష్మాతలనాయక సద్మంబునందున
మంగళరావముల్ మూర్ఛమ్రోయ
నాలించి హేతువె య్యది యంచు తాదుష్ట
బుద్ధియొంచెడి వేళ భూమిసురుఁడు
మంగళపత్రిక మంత్రికి నొసఁగ నా
తండద్దిచూచి ఖే దంబువిస్మ
యంబును జెంది యె ట్లవనీశ్వరుండు ప
ట్టాభిషేకము చంద్ర హాసునకును

గీ॥ సల్పు నాతండు కాళికా సద్మమందు
నాదుకృత్రిమమునఁజచ్చి నాఁడు కాదె
యనుచు యోజించు వేళకే హంతకులును
మదను శిరమును దెచ్చిరా మంత్రికడకు ॥

ఉ॥ అంతటదుష్టబుద్ధి హృద యంబున సంశయ ముల్లసిల్లఁగా
వింతదనమ్ముఁగాంచి కడు వేమరుదాల్చిన పోల్కినుండి దృ
ష్టాంతముఁ బోల్పఁజాలక ని రంతర దుర్భ్రమ నంది చంద్రహా
సాంతము హంతకుల్ సలిపి గాతని కెట్టుల రాజ్యమిచ్చుటల్॥

కం॥ కడ తేరె చంద్రహాసుం
డడఁగె మదీయాగ్రహాప్ర యత్నమ్మని ముం
దడుగిడి ఖండితశిరమున్
బొడఁగని దీపముల చెంతఁ బోల్చిపొగలుచున్॥

ఉ॥ ఖండితశీర్షభాగము జ గన్నుతనిర్మలధీవిశేషస
న్మండితమూర్తియౌ మదను మస్తకమంచును నిశ్చయించి తా
గుండియ బాదుకొంచునను గుం గొడుకా కొడుకా యటంచునో
రెండఁ బ్రపంచమున్ మఱచి యేడువసాగ ననేకరీతులన్॥

మ॥ తనయా! నిన్ను స్వతంత్రపాలకునిగాఁ దాత్పర్యమొప్పాఱ నే
ననయంబున్ బొనరించుయత్నములు వ్య ర్థాకారమున్ దాల్చె నీ
తనుభాగంబును గాంచి యెవ్విధమునన్ దాపంబు సైరింతు ని
న్గనకే నెట్టుల జీవితావధిని న గ్గన్ సేతురా పుత్రకా॥

చం॥ తల ధరపైని మోఁదుకొని తాపమునొందుచు నేడ్చుచున్ సుతున్
దలఁచుచు దుష్టబుద్ధి పరి తాపమునొందెడి రీతిగాంచి హృ
ద్విలసితశోకభారమున విశ్వము విస్మృతినొంది వాని భా
ర్య లలిత కుందసాగె విష యాసతి దాల్చె విచారభావమున్॥



చం॥ తనయుని జంపికొంటి పరి తాపకరంబగు నాదుజన్మమే
లని యలదుష్టబుద్ధి తన యంగనతోఁ జితిచొచ్చ నెంచగాఁ
దనయయు భ్రాతృశోకమున ధైర్యముమాని శరీరమగ్నిలో
న నిడ నెంచె శోకరస నాటకమాడిరి వారలెల్లరున్

చ॥ అదివిని చంద్రహాసుఁ డభ యం బభయంబని పల్కుకొంచు
మొదవె? వచింపుఁడంచుఁ దన యోలగమున్ విడియేగుదెంచి యు
న్మదనుని రక్తలిప్తమగు మస్తకభాగము చూచి కన్నులన్
బ్రదిలి విచారలీనముగ వేఁడిజలంబు జనింప నేడ్చుచున్॥

సీ॥ విషయను నాకిచ్చి పెండ్లిగావించిన
యానాటినీసు ద యారసంబు
అన్యుఁడటంచు న న్నరయక కడుగౌర
వించుచు నుండు నీ ప్రేమభరము
సామ్రాజ్యమే లెడ్డి సౌభాగ్యమొనగూర్చి
కనికరించిన నీదు వినయగరిమ
అనుజని కంటెన న్ననురాగమునజూచి
వర్ధమానుని జేయు వత్సలతయు

గీ॥ భావమున సుస్వరూపసం పదలఁదాల్చి
మర్మములఁ జెందుచుండెనో మదన నిన్ను
విడచి నేనెట్లు బ్రతుకుదీ పృథ్విభరము
నీవు లేకున్న [illegible] నాకు నిరయసమము॥

చం॥ అనుచును జంద్రహాసుఁడు క - రాసిని కంఠముపైని జేర్చినా
యనుగు గతింప నే బ్రతికి - యోపయి గాంచెడిసౌఖ్యమెద్ది యం
చును తల ద్రెంచికోఁ దలచు - చున్ గనుదోయినిమాయనంతఁదో
నన సురలెల్ల పూజడి నా - నర్చిరి దిక్కులు పిక్కటిల్లఁగన్॥

సీ॥ రౌద్రరసంబును - రాగరసంబును
ముఖసరోజమ్మున - మొలకలెత్త
కరఖడ్గకాంతులు - కాంచనభూషలు
వింతవన్నలతోడ - వియ్యమంద
సంభ్రమవేగంబు - శాంతస్వభావమ్ము
పాలునీర్వలె నైక్య - భావమొంద
కడకంటిచూపులు - కారుణికత్వంబు
సుస్వరూపంబున - శోభిలంగ

గీ॥ అడకువయు నెయ్యమును మది - సంకురింప
భువనమోహనరూప వై - భవముగదుర
గాళికాదేవి గళగత - ఖడ్గమూని
యప్డు ప్రత్యక్షమై చంద్ర - హాసుఁ దనిపె॥

ఉ॥ మెచ్చితి నీదుభక్తికి నెద - మెచ్చితి నీభుజవర్తనావళిన్
మెచ్చితి మిత్రభావమును - మేదిని నీసుయశఃపతాకముల్
నిచ్చలు తాండవింప ధర - ణీభరమున్ వహియించుమయ్య నీ
కిచ్చెద నెద్దియేన్ వరము - కీప్సితమోల్[illegible]ంతతో నంచనన్॥



గీ॥ చంద్రహాసుఁను మోదంబు - సందడింప
కలవు భోగమ్ములెన్నియో - ఘనచరిత్ర
నాత్మమిత్రుని దయచేయు - మంతెచాలు
స్వర్గపరిపాలనంబునో - సంగినట్లు॥

మ॥ అని ప్రార్థించిన కాళియియ్యకొని చి - త్తాంకూరితానందభా
జనయై యవ్విధిసల్పఁగా మదనుఁడా - శాపాశనిర్విణ్ణునిన్
జనకున్ గూర్చి నమస్కరించి జననిన్ - సౌజన్యతన్ జూచి మి
త్రుని యాలింగనమున్ బొనర్చియనుజన్ - దోడ్తోడవీక్షింపుచున్॥

చ॥ కనులనుమోడ్చునంత నల - కాళియదృష్టిపథంబుదాటె నె
మ్మనమున దుష్టబుద్ధియు బ్ర - మాదము నందితినంచు మంత్రిసం
దను ననురాగభావకల - నన్ కవుగింట ధరించి దోషినై
తిని నను సైపుమంచును ను - తించెను దత్సతి మోడ్చి కేల్గవన్॥

తే॥గీ॥ అవలచంపకమాలిని - హస్తమంది
యాత్మసామ్రాజ్యమును విభ - వాకరముగ
నరసి పాలించుచును చంద్ర - హాసవిభుఁడు
మదనునకు చెంగట నమాత్య - పదవి నొసఁగె॥

చం॥ ధరణి సమస్తసస్యకలి - తంబుగ బంటలతోఁ దనర్చె, ధీ
వరులు నృపాలపాలన సు - భాగ్యముగాంచి రహించె ధారుణీ
భరము తొలంగె నాకనుచు - భావనజేసె మహీవిభుండు ధ
ర్మరుచిరసంవృతంబయి ర - మాసతి నర్తనసల్పె నెయ్యెడన్॥

కం॥ ఈకథ వ్రాసిన జదివిన
ప్రాకట భోగాలవాల । బహు భాగ్యంబుల్
శ్రీకాంతుఁడు కృపఁజేసి శు
భాకాంతుల నొసఁగి మెప్పు । డలరుచుగాత౯॥

—♦ ఆశ్వాసాంతము. ♦—

చం॥ అతులిత మత్స్యహస్రమహి । తాన్వయవార్ధిశశాంక శాంకరీ
పతిచరణాంబుజద్వితయ । బద్ధమనోబ్జ సదాన్నదానస
ద్వ్రతనియుతాభిరామ గుణ । పన్మణిమంజులభాసమాన పం
డితజనకీర్తనీయ సుగు । ణస్మరణీయ దయారసోదయా॥

స్రగ్విణి.

నీరజాతాన్వయా । నిత్యసత్యోదయా
ధీరచేతఃప్రియా । దీనమోదోదయా
సూరిగేయవ్రతా । స్తుత్యకీర్తిస్థితా
ధారణాసంగతా । ధైర్యసుశ్రీయుతా॥

గద్య.

ఇది శ్రీశేషాచలాధీశ చరణసేవాసమాసాదిత కవితా
విచిత్ర భూపాటివంశపారావారరాకాసుధాకర
శేషాచార్యపౌత్ర వేంకటరంగాచార్య
పుత్ర శేషాచార్యకవిమిత్ర ప్రణీత
చంద్రహాస చరిత్రమ్మునందు
చతుర్థాశ్వాసము - సంపూర్ణము.

---

# తప్పొప్పుల పట్టిక

| పేజి | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 10 | 10 | భాసుకారా | భాసురాకారా |
| 15 | 2 | ప్రథమాశాశ్వము | ప్రథమాశ్వాసము |
| 33 | 12 | రామనిక౯ | రామునిక౯ |
| 34 | 2 | స్తుత | స్తుత్య |
| 45 | 18 | ప్రస | ప్రసక్తి |
| 59 | 9 | చుంగులు | చెంగులు |
| 70 | 6 | నియ్యంబు | వియ్యంబు |
| 71 | 6 | వననట్లాక | విననట్లాక |
| 72 | | చంచ్రహాస | చంద్రహాస |
| 75 | 16 | ద్రృంతు | ద్రుంతు |
| 76 | 6 | వాద్ఛాదనంబు | వాచ్ఛాదనంబు |
| 77 | 12 | బోరు | బోరు |
| ,, | ,, | సాహాసులు | సాహాసులు |
| 79 | 8 | గాశ | గాగ |
| 82 | 18 | పుజంపు | పుంజపు |

